# మనదేశంలోని వరి పంటలో 50,000 రకాలు ఉన్నాయని మీకు తెలుసా?

ఇలాంటి మరెన్నో ఆసక్తికర
విశేషాల కోసం

# వసుధ

2002 జూన్ చందమామతోపాటు
16 పేజీల ప్రత్యేక అనుబంధం!

ఆటలు శీర్షికలు క్విజ్ కార్యకలాపాలు కథలు

Sponsored by



**NATIONAL FOUNDATION FOR INDIA**

జీవవైవిధ్యంతో మైత్రిగా మసలుకోవడం నేర్చుకోండి!
జూన్ 5, ప్రపంచ పర్యావరణ దినోత్సవం!

A  ACTIVE

B  BUZZ BOSS

C  CADET DX

D  DEVIL DX

E  ELEPHANT

F  FISH

G  GIRAFFE

H  HEN

I  INSECT

J  JOKER

K  KIDD DX

L  LI'L ANGEL LAMBADA LIMBO

M  MISSILE MISS INDIA Jr

N  NEST

O  ORANGE

P  PIRANHA

Q  QUEEN Jr

R  ROBO COP

S  SPARKY  SALSA

T  TERMINATOR




V W

The largest range of kids bikes

**HERO CYCLES**

THE ABC OF CYCLING

HTA.5979.2001



















## ఈ సంచికలో



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandamama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# శాంతి వర్ధిల్లాలి!

ప్రపంచంలోని నాలుగు ప్రధానమైన మతాలకు జన్మస్థానం భారతదేశం. హిందూ, బౌద్ధ,జైన, శిక్కు మతాలు ఇక్కడే ఆవిర్భవించాయి. ఒకటవ శతాబ్దంలో మనదేశంలో అడుగుపెట్టిన క్రైస్తవ మతం క్రమంగా వేళ్ళూనింది. ఆ తరవాత ఐదు శతాబ్దాలకు ఇస్లాం మతం వచ్చింది. ముస్లిం మతానుయాయులు మొదట మనదేశానికి వర్తకులుగా, యాత్రికులుగా వచ్చారు. ఆ తరవాత దండెత్తి వచ్చి, దేశాన్ని ఆక్రమించి దాదాపు ఐదు శతాబ్దాలపాటు పాలించారు. వారిలో సుప్రసిద్ధుడైన అక్బర్ చక్రవర్తి సర్వమత సామరస్యం ఆశించి, ''దిన్- ఇల్-లాహి'' అనే మతాన్ని ప్రచారం చేశాడు. ఆయన కాలంలోనే శిక్కుమతం పుట్టింది.

స్వాతంత్ర్యోద్యమంలో మతభేదాలు లేకుండా ప్రజలందరూ పాల్గొన్నారు. కానీ దురదృష్టవశాత్తు, స్వాతంత్ర్య సిద్ధికి పూర్వమే, మత ప్రాతిపదిక మీద మనదేశం రెండుగా విభజించబడింది. ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య యుద్ధాలు జరిగినా, అవి సరిహద్దు ప్రాంతాల హక్కులకు సంబంధించినవే అని మరిచిపోకూడదు. మత సౌభ్రాతృత్వం లక్ష్యంగా మన నాయకులు లౌకిక రాజ్యాంగాన్ని రూపొందించారు. అయినా, స్వాతంత్ర్యం లభించి యాభై అయిదేళ్ళు కావచ్చినా మతఘర్షణల కారుచిచ్చు ఇంకా ఆరిపోలేదు. తప్పు ఎవరిదైనాసరే, ఇటీవల పలువురు అమాయక ప్రజల ప్రాణాలను బలిగొన్న సంఘటనలు భారతజాతినే — సిగ్గుతో తలవంచుకునేలా చేశాయి.

అహింసామూర్తి మహాత్మాగాంధీ పుట్టినదేశం మనది అనీ; మనం నడుస్తున్నది ఆయన చూపిన అహింసామార్గంలోనేననీ మనం మరిచిపోయాం!

మతసామరస్యాన్నీ, శాంతియుత సహజీవనాన్నీ కాంక్షిస్తూ, చందమామ వాటి కోసం కృషిచేస్తున్నది. మత వైషమ్యాలను రెచ్చగొట్టేవారి మనసులలోనూ మంచి మార్పు రావాలనీ; వివేకం వికసించి శాంతి వర్ధిల్లాలనీ కోరుకుందాం!

---

సంపాదకుడు : విశ్వం

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 8

భారత చరిత్ర పుటలలో అసంఖ్యాకమైన వీరులు తారసపడతారు. వీరిలో మీరు ఎంతమందిని గుర్తించగలరో చూడండి.

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!

1. నా పదహారవయేట క్రీ.శ. 606 లో థానేశ్వర్‌కు రాజునయ్యాను. ఎల్లప్పుడూ దయ, దాతృత్వం కల పాలకుడుగా ఉండడానికే ప్రయత్నించాను. నేనెవరు?

---------------------------------------------

2. విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన గొప్పరాజును నేను. క్రీ.శ. 1509 నుంచి 1529 వరకు నా పాలన సాగింది. నేనెవరిని?

---------------------------------------------



3. నన్ను నేను మరాఠా రాజ్యానికి రాజుగా ప్రకటించుకున్నాను. రాయఘడ్‌లో 'ఛత్రపతి' అనే బిరుదు ప్రదానం జరిగింది. ఇంకా నేనెవరో తెలియలేదా?

---------------------------------------------

4. మేవార్ యువరాజునైన నేను, హల్దీఘటీ యుద్ధంలో అక్బర్‌చక్రవర్తి చేత ఓడించబడి నప్పటికీ లొంగిపోవడానికి నిరాకరించాను. నా పేరు తెలుసా?

---------------------------------------------

5. నాకు గొప్ప పల్లవరాజుననే కీర్తి ఉంది. చాళుక్య రాజు రెండవ పులకేశిని ఓడించాను. మహాబలిపురంలో రాతి ఆలయాలను నిర్మించాను. నేనెవరు?

---------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన చారిత్రక వీరులు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

నా అభిమాన చారిత్రక వీరుడు:

..................................................................

..................................................................

పాల్గొనేవారి పేరు: ..................................................

వయసు: ............ తరగతి: ..........................................

చిరునామా: ..........................................................

..................................................................

పిన్: ........................ ఫోన్: ..........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం: ......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 జూన్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-8<br>
చందమామ ఇండియా లిమిటెడ్<br>
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ<br>
ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.

<u>సూచనలు:</u>

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు





# ఉచిత సలహాలు

సదాశయుడికి తలిదండ్రులిచ్చిన ఆస్తి వుంది. దాంతో ఆయన, భార్యాబిడ్డలు రోజులు వెళ్ళ బుచ్చుతున్నారు. తీరుబడి సమయాన్ని వృధా చేయక సదాశయుడు రకరకాల పుస్తకాలు చదువుతూంటాడు. ఏమైనా జటిలమైన సమస్యలు వచ్చినప్పుడు గ్రామాధికారితో సహా ఆ ఊళ్ళో ఎందరో సదాశయుడి సాయం కోరుతూంటారు. విషయం విని ఆయన తనకు తోచిన పరిష్కారం చెబుతూంటాడు. ఆ విధంగా చాలామంది ఆయన వల్ల ఎంతో ప్రయోజనం పొందారు.

అలాంటివారిలో సూరయ్య ఒకడు. సూరయ్య వ్యాపారి. ఒకసారి ఆయన కొన్న ధాన్యం బస్తాలు నీటిలో తడిసిపోయాయి. లబో దిబోమంటున్న ఆయనకు, "చిత్రపురం గ్రామస్థులు ఉప్పుడు బియ్యం వాడతారు. నీ ధాన్యాన్ని ఉప్పుడు బియ్యంగా మార్చి అక్కడ అమ్ముకో," అని సదాశయుడు సలహా ఇచ్చాడు.

ఆ ప్రకారం చేస్తే సూరయ్యకు నూరు వరహాలు లాభం వచ్చింది. మరొకసారి కష్టపడి ఒక ధనికుడి కోసం వజ్రాలహారం చేయించాడు సూరయ్య. అది ఆ ధనికుడికి నచ్చలేదు. పది వేల వరహాలు నష్టమని సూరయ్య గుండెలు బాదుకుంటే, "రత్నపురం జమీందారుకు కొత్తరకాల హారాలు సేకరించడం ఇష్టం. ఆయన నీ హారాన్ని కొనడమేకాదు, మంచి బహుమతి కూడా ఇస్తాడు,"అని సూరయ్యకు, సదాశయుడు చెప్పాడు. ఆ విధంగా సూరయ్యకు నష్టం పూడుకోవడమేకాక, రెండు వేల వరహాలు లాభం కూడా వచ్చింది.

ఇలా ఉండగా, ఒక రోజున సూరయ్య ఇంటికి, ఇరువయ్యేళ్ళ యువకుడొకడు వచ్చాడు.

'వసుంధర'

అతడి పేరు చంద్రుడు. ఏ ఆధారమూ లేక సూరయ్యను ఆశ్రయించాడు. అయితే, చంద్రుడికి మోసగాడన్నపేరుంది. అందువల్ల తనకు మనిషి అవసరం ఉన్నప్పటికీ, చంద్రుడినింట్లో వుంచుకునేందుకు తటపటాయించాడు. సదాశయుణ్ణిసలహా అడిగితే, "పుట్టుక తోనేఏ మనిషీచెడ్డవాడుకాదు. నువ్వు చంద్రుడికి ఆశ్రయమిచ్చి ఆదుకో. నువ్వతణ్ణి నమ్మితే, అతడూ నమ్మకంగానేవుంటాడు," అని చెప్పాడు.

సరే అని సూరయ్య, చంద్రుణ్ణి తన ఇంట్లో వుంచుకుంటే, అతడొకరోజున ఇంట్లోంచి రెండువేల వరహాలు దొంగిలించి పారిపోయాడు.

సూరయ్య మహాకోపంగా సదాశయుడింటికివెళ్ళి, "నీమాటమీద చంద్రుడినింట్లో వుంచుకున్నాను. అందువల్ల రెండువేల వరహాలు నష్టపోయాను. నాకు నువ్వు నష్టపరిహారం చెల్లించాలి," అన్నాడు.

సదాశయుడు చిరాకుపడి, "సలహా ఇవ్వడంవరకే నా వంతు. ఫలితం నీ ఆచరణమీద ఆధారపడి వుంటుంది. నువ్వు అతణ్ణి నిజంగా నమ్మి బాగా ఆదరించి వుంటే, అతడూ నిన్ను మోసంచేసి వుండేవాడు కాదు," అన్నాడు.

"నేనెలాంటివాణ్ణో నీకు చాలాకాలంగా తెలుసు. నాకు తగిన సలహానే ఇస్తావనుకున్నాను. నువ్వు నాకు తప్పుడు సలహా ఇచ్చావు. నాకు జరిగినరెండువేల వరహాల నష్టాన్నీ నువ్వే పూడ్చాల్సి వుంది. ఇందుకొప్పుకోకపోతే, నేను గ్రామాధికారికి ఫిర్యాదుచేస్తాను," అన్నాడు సూరయ్య. అయినా, సదాశయుడాయన మాటలు లెక్కచెయ్యలేదు. వ్యవహారం గ్రామాధికారి దాకా వెళ్ళింది.

గ్రామాధికారికి అసలు విషయం అర్థమైంది. సూరయ్య బుద్ధి మంచిదికాదనీ, అలాంటివాడి పితూరీకి విలువయిస్తే, సదా



శయుడింకెవరికీ మాటసాయం చేయడనీ అయనకు అనిపించింది. అందువల్ల తనే స్వయంగా వెళ్ళి సదాశయుణ్ణి కలుసుకుని, "సూరయ్యకు తగువిధంగా బుద్ధిచెప్పకపోతే, ఊళ్ళో చెడ్డవాళ్ళు పెరిగిపోయి మంచివాళ్ళను బ్రతకనివ్వరు. కనుక నువ్వే ఏదైనా పరిష్కార మార్గం చెప్పు!" అని అడిగాడు.

సదాశయుడాయనకు ఏం చెయ్యాలో చెప్పాడు. ఆ ప్రకారం మర్నాడు గ్రామాధికారి ఊళ్ళో అందర్నీ సమావేశపరిచి, సూరయ్య పితూరీ గురించి చెప్పి, "అతడి పితూరీలో న్యాయముంది. అయితే, అసలు సూరయ్య, సదాశయుడి సలహా ఎందుకు పాటించాడో చెప్పవలసివుంది!" అన్నాడు.

దీనికిసూరయ్యవెంటనే, "గతంలో కూడా సదాశయుడు నాకు ఎన్నో సలహాలిచ్చాడు. వాటివల్ల ప్రయోజనం కలగడంతో, నాకాయన సలహాలమీద నమ్మకం కలిగింది. ఆ నమ్మకంతోనే ఇప్పుడు నష్టపోయాను," అన్నాడు.

"అయితే, సదాశయుడు నీకు రెండు వేల వరహాలు నష్టపరిహారంగా ఇచ్చుకోక తప్పదు. కానీ అంతకుముందు సదాశయుడి సలహాలవల్ల, నీకు కలిగిన ప్రయోజనమెంతో లెక్కకట్టి అదంతా నువ్వు ఆయనకు ఇచ్చుకోవాలి," అన్నాడు గ్రామాధికారి.

ఇది విని ఊరివాళ్ళందరూ నవ్వారు. కానీ గ్రామాధికారి మాత్రం నవ్వక, "ఇకమీదట సదాశయుడి సలహాలవల్ల ప్రయోజనం పొందినవారందరూ, తమ లాభాల్లో ఆయనకు వాటాలివ్వాలి. నష్టంవస్తే ఆయన తన వాటా భరిస్తాడు. ఈ వ్యవహారమంతా గ్రామాధికారినైన నాముందు జరగాలి. అలా జరగనివాటికి నేను బాధ్యుణ్ణికాను!" అన్నాడు గంభీరంగా.

ఉచితంగా లభించే సదాశయుడి సలహాలకు, ఆ రోజునుంచీ వెలకట్టవలసి వచ్చినందుకు, ఊరంతా సూరయ్యను నానా తిట్లూ తిట్టారు. సదాశయుడు మాత్రం, "స్వార్థ పరుడి ఆశపోతుగుణమే మంచివాడిసాయానికి విలువను తెస్తుంది.ఆ విధంగా నాకు సూరయ్య మేలే చేశాడు. ఇకమీదట ఎవరికీ ఉచితసలహాలనివ్వను!"అని అప్పటి నుంచీ మరింత సుఖంగా జీవించాడు.






# మాయాసరోవరం

## 4

[ఊడలమర్రి దగ్గర జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ ఒక పురాతన తాళపత్ర గ్రంథం దొరికింది. కాని, రాజుగారి పిల్లలజాడ మాత్రం తెలియలేదు. వాళ్ళు దాపులనున్న కొండలకేసి బయలు దేరారు. ఆ సమయంలో, ఆ ప్రాంతాలగల ఒక గ్రామప్రజలు తమ జొన్నచేల కేసి పోగా, వాళ్ళమీదికి ఒక వికృతాకారుడు, తానెక్కివున్న ఏనుగును ఉసికొల్పాడు. - తరవాత]

తమకేసి వస్తూన్న ఏనుగునూ, దానిమీద మొసలిరూపంలో వున్నవాణ్ణీ చూస్తూనే, గ్రామస్థులు భయకంపితులైపోయారు. అంతలో వికృతాకారుడు తన వాహనాన్ని వాళ్ళ దాపులకు పరిగెత్తించి, పెద్దగొంతుతో, "మీలో పారిపోజూసేవాళ్ళకు తప్ప, మిగతా వాళ్ళకు నానుంచి ఎలాంటి హానీ జరగదు," అన్నాడు.

ఆ మాటలతో గ్రామస్థులకు కొంచెం ధైర్యం కలిగింది. వాడు ఎంత వికృతాకారుడైనా వాడిమాటల తీరునుబట్టి, వాడు మనిషే అనుకున్నారు వాళ్ళు. మాటా పలుకూ లేకుండా నిర్వెరపడి చూస్తున్న గ్రామస్థులను తిరిగి వికృతాకారుడే పలకరించి, "మీలో పెద్ద ఎవడు? అక్కడ మంచెమీద వున్నవాడు మీ గ్రామం కుర్రాడేనా? వాడితో నాకు ఆహారం తెమ్మనీ, ఒక వైద్యుణ్ణికూడా వెంటబెట్టుకు రమ్మనీ చెప్పానే! కాని, మీరు కర్రలూ, కత్తులతో నన్ను చంపేందుకు ఇక్కడికొచ్చినట్టుంది. అవునా?" అని ప్రశ్నించాడు.

రూపానికి భయంకరుడేకాని, తతిమ్మా విషయాల్లో వికృతాకారుడు తమలాంటి వాడేనని గ్రామపెద్దకు తోచింది. అతడు వికృతాకారుడికి చేతులెత్తి నమస్కరిస్తూ, "అయ్యా, మొసలిదొరా! మమ్మల్ని క్షమించాలి. మంచెమీది కుర్రాడు, మీరు చెప్పమన్న మాటలు మాతో చెప్పాడు. అయితే, వింత



ఏనుగూ, వింత మనిషీ అంటూ మాట్లాడాడు. అందువల్ల, ఏ ఏనుగుల గుంపో వచ్చి మా జొన్న చేల మీద పడినవనుకున్నాం," అన్నాడు.

ఏనుగుమీది మొసలి ఆకారంవాడు చేయెత్తి కోపంగా, "ఒరే, గ్రామపెద్దా! నువ్వు అసలు సంగతి తప్ప, అనవసరమైన సంగతులు చాలా మాట్లాడావు. ఇంతకూ మీరు, నాకోసం ఆహారాన్నీ, వైద్యుణ్ణీ వెంటబెట్టుకు వచ్చారా లేదా?" అని ప్రశ్నించాడు.

వాడి కోపంచూసి గ్రామపెద్ద వెనక్కు అడుగువేసి, "అయ్యా, మొసలిదొరా! తమ కోసం పంచభక్ష్యపరమాన్నాలతో మా ఇంట భోజనం తయారవుతున్నది. ఇక వైద్యుడంటారా, ఒకళ్ళనుకాదు, ఇద్దర్ని తీసుకొచ్చాం," అన్నాడు.

మొసలి ఆకారంవాడు తన డొక్కలోంచి బయటికి పొడుచుకు వచ్చిన విరిగిన కత్తికేసి ఒకసారి విచారంతో చూసుకుని, చిన్నగా మూలిగి, "ఆ వైద్యులెక్కడ?" అంటూ అడిగాడు.

గ్రామపెద్ద తెలివైనవాడు, జిత్తులమారి. అతడు తన చేతిలోని పొన్ను కర్రను పైకెత్తి, గ్రామస్థులతో, "మన చరకాచారిగారెక్కడ? ఆ వీరనారాయుడు ఎక్కడ చచ్చాడు?" అన్నాడు.

చరకాచారీ, వీరనారాయుడూ భయంతో వణికిపోతూ పారిపోవాలని చూస్తున్నారు. గ్రామపెద్దపోయి వాళ్ళను చేతులు పట్టుకుని ముందుకు లాగి, మొసలి ఆకారంవాడితో, "మొసలిదొరా! వీళ్ళే మా గ్రామవైద్యులు. ఇద్దరికిద్దరూ మంచి హస్తవాసిగలవాళ్ళు," అన్నాడు.

ఆ మరుక్షణం మొసలి ఆకారంవాడు తలను కప్పివున్న శిరస్త్రాణాన్ని వెనక్కు లాగాడు. అతడికి నలభై ఏళ్ళకన్న ఎక్కువ వయసుండదు. ఎర్రని దేహచ్ఛాయ. భుజాల మీదికి పడుతున్న నల్లని ఉంగరాల జుట్టు.

"మామూలు మనిషే! ఏదో రాజ కుటుంబీకుడిలా వున్నాడు," అన్నాడు శస్త్రవైద్యం నేర్చిన వీరనారాయుడు పక్కనున్న చరకాచారితో.

"రాక్షసులు కామరూపులు. కావాలనుకున్న రూపాన్ని క్షణాలమీద ధరించగలరు. ఏమైనా మా గురువుగారికి చేసిన ప్రమాణం ప్రకారం, రోగగ్రస్థుడైనవాడు రాక్షసుడైనా, పిశాచం అయినా నేను వైద్యం చేస్తాను," అన్నాడు చరకాచారి.

"నేనూ, వైద్యం నేర్పిన మా అయ్యదగ్గిర అలాంటి ప్రమాణమే చేశాను. ఊ, తమరు ముందునడవండి," అన్నాడు వీరనారాయుడు.

చరకాచారి ఏనుగును సమీపించి, "ముసలి ప్రభూ! తమను పట్టి పీడిస్తున్నరోగం.. క్షమించాలి, వ్యాధి ఏమిటి? సెలవివ్వండి!" అన్నాడు.

"నీకు దృష్టిమాంద్యం లేదుగదా!" అంటూ కోపంగా తన డొక్కలో దిగివున్న కత్తి భాగాన్ని చూపించాడు ముసలి ఆకారంవాడు.

చరకాచారి వినయంగా, "ప్రభూ, వీరనారాయుడు శస్త్రవైద్యంలో సాటిలేనివాడు. కత్తిని అతడు బయటికి లాగగానే, నేను రక్తస్రావం ఆగేందుకూ, గాయం మానేందుకూ అవసరం అయిన మూలికలూ అవీ పోగుచేసుకు వస్తాను," అంటూ గబగబా పక్కనవున్న గుబురుచెట్లకేసి పరిగెత్తాడు.

తర్వాత, వీరనారాయుడు ఏనుగుమీదికి పోయి, వికృతాకారుడి డొక్కలో దిగివున్న కత్తిని పరీక్షగా చూసి, "దొరా, కత్తి తళతళ మెరుస్తున్నది. ఇదేదో రాచకత్తిలా వున్నది," అన్నాడు.

ముసలి ఆకారంవాడు పెద్దగా మూలిగి, "ఇది రాచకత్తిలా వుండడంకాదు, రాచకత్తే! ఒకానొక పొగరుబోతు రాజకుమారుడు, నామీద తిరగబడి కత్తితో బలంగా డొక్కలో పొడిచాడు. వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని ప్రయత్నంచేసి, నేనొక్కణ్ణే ఈ ఆపద కొని తెచ్చుకున్నాను. చచ్చువెధవలు, నా తోటి వాళ్ళు ఆనందంగా తిరిగిపోయారు. నేనీ ప్రాంతాల సగం మతిచెడి తిరుగుతున్నాను," అన్నాడు.

ఈ జవాబుతో వీరనారాయుడికి, తమ రాజుగారి కుమారుడూ, కుమార్తే అపహరించబడిన సంగతి గుర్తుకొచ్చింది. వాళ్ళను అపహరించిన ముఠాలోనివాడన్నమాట వీడు!



ఇప్పుడు తను, వీణ్ణి డొక్కలో నుంచి కత్తిలాగే ప్రయత్నంలో, కత్తిని అటూ ఇటూ బాగా కుదిలించి ప్రాణాలు తీయవచ్చు. కాని, అందువల్ల రాజుగారి పిల్లలు ఎక్కడ నిర్బంధంలో వున్నారో తెలిపేవాడు లేకుండాపోతాడు. కనక, ఈ దుర్మార్గుణ్ణి చావకుండా కాపాడి, రాజుగారికి ఒప్పచెప్పటం మేలనుకున్నాడు వీరనారాయుడు.

ఇలా ఆలోచించి అతడు, దూరంగా నిలబడివున్న గ్రామపెద్దతో, "ఇక్కడ దొరకు శస్త్రచికిత్స పూర్తయింతర్వాత, వారిని మన గ్రామం తీసుకుపోవాలి. ముందుగా మనిషిని పంపి, అక్కడ వారి విడిదికి తగిన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

వీరనారాయుడు ఇలా అనగానే, ముసలి ఆకారంవాడు అతడికేసి కనుబొమలు ముడిచి గుచ్చిగుచ్చి చూస్తూ, "ఒరే, నీపేరేమన్నావు,



దూరంగా చెట్ల వెనకనుంచి చరకాచారి వేసిన, ''రక్షించండి!'' అన్న కేకా, ఆ వెంటనే రెండు, మూడు ఏనుగులు ఒక్కసారిగా దూరం నుంచి ఘీంకరించడం వినబడింది.

ఆ వెంటనే గ్రామపెద్ద, మొసలి ఆకారం వాణ్ణి సమీపించి, ''మొసలిదొరా! చరకాచారి గారు ఒకే ఒకకేకపెట్టి వూరుకున్నాడు. అంటే, ఆయనకెదురైన ప్రమాదమేదో, ఆయన్ను పొట్టనబెట్టుకున్నట్టే గదా? కనక, ఆ అడవి ఏను గులమంద మనమీదికి వచ్చి పడక ముందే, మనం గ్రామం చేరటం మంచిది,'' అన్నాడు.

''బాగానే వుంది! మరి నా చికిత్స మాటే మిటి? ఎంతకాలం ఈ విరిగిన కత్తిముక్కను డొక్కలో పెట్టుకుని తిరిగేది?'' అన్నాడు మొసలి ఆకారంవాడు బాధగా.

ఇంతలో చరకాచారి మరొకసారి, ''అయ్యో రక్షించండి!'' అంటూ ఒక చావుకేక పెట్టాడు. అదే సమయంలో దూరం నుంచి కొన్ని అడవి ఏనుగులు తుప్పలూ, పొదలూ నలగదొ క్కుతూ, చెట్లకొమ్మలనుఫెళఫెళమని విరుస్తూ వేగంగా రాసాగినై.

మొసలి ఆకారంవాడు చప్పున తన శిర స్త్రాణాన్ని తలమీదికి దించుకుని, ఏనుగును అదిలించి, పొడవాటి శూలాన్ని ఎత్తి పట్టుకు న్నాడు. వీరనారాయుడు ఏనుగు మీద గెంతుతూ, ''అయ్యో, రక్షించండి! రక్షిం చండి!'' అంటూ చరకాచారికన్న పెద్దగా కేకలు పెట్టసాగాడు.

మొసలి ఆకారంవాడు, వీరనారాయుడి ఆర్తనాదాలు పట్టించుకోకుండా, తన ఏను గును అదిలిస్తూ, ''జలగ్రహా!'' అంటూ పెద్దగా హుంకరించాడు.

వీరనారాయుడా?'' అంటూ వీరనారాయుడి మెడపట్టుకుని పైకెత్తి, ''బాధకొద్దీ నే అన్న మాటలవల్ల, నేనెవరైందీ నువ్వు గ్రహించిన ట్టుంది. ఐతే, ఈ సంగతి మీ గ్రామంవాళ్ళతో గాని అన్నావో, నిలువునా నీ ప్రాణాలు తీస్తాను, తెలిసిందా?'' అన్నాడు.

వీరనారాయుడు గడగడ వణికిపోతూ, ''మొసలిదొరా! నన్ను చంపకండి. నా రాత! ఒక్కగానొక్క మగ సంతానం లేదు, ఆరుగు రాడపిల్లల తండ్రిని. మా రాజుగారూ, మీరూ సమఉజ్జీలు. ఏదో కూరగాయ వైద్యం చేసు కుంటూ బతుకుతున్నవాణ్ణి నేను. కాస్త పళ్ళ బిగువున బాధను తట్టుకోండి. ఇదే, కత్తిని బయటికి లాగబోతున్నాను,'' అన్నాడు.

మొసలి ఆకారంవాడు, నారాయుణ్ణి వదిలాడు. వాడు కత్తిని రెండు చేతులతో బలంగా పట్టుకుని లాగబోతున్నంతలో,

ఆ వెంటనే జలగ్రహం దూకుతూపోయి, అందుబాటులోకి వచ్చిన అడవి ఏనుగునొ కదాన్ని తన వాడి దంతాలతో తలమీద బలంగా పొడిచింది. ఆ దెబ్బకు అడవి ఏనుగు ఘీంక రిస్తూ పక్కకు పడిపోయింది. అదే అదనుగా మొసలి ఆకారంవాడు మరొక ఏనుగు కుంభ స్థలం మీద శూలంతో గట్టిగా పొడిచాడు. ఆ పోటుకు అది తలవంచి ముందుకు కూల బడింది. ఇది చూసి మిగిలిన ఏనుగులు వెనుదిరిగిపోతున్నంతలో, మొసలి ఆకారం వాడు వాటిని కొంతదూరం తరిమి, ఆయాస పడుతూ తన వాహనాన్ని ఆపాడు. హఠాత్తుగా వాడికి తనకు చికిత్సచేయవచ్చిన వీరనారా యుడు గుర్తుకొచ్చాడు. వాడు కళవెళ పడి పోతూ చుట్టూ ఓమారు కలయచూసి, "ఒరే, వీరనారాయుడూ, ఎక్కడ?" అని కేక పెట్టాడు.

ఆ వెంటనే వీరనారాయుడు, మొసలి ఆకారంవాడి వీపు వెనకనుంచి, "మొసలి దొరా! నేనింతసేపూ తమ మొసలి తోక పట్టు కుని వేళ్ళాడుతున్నాను. మనం గెలిచామా? అడవి ఏనుగులు గెలిచినయ్యా?" అంటూ ప్రశ్నించాడు.

జవాబు విని మొసలి ఆకారంవాడు కాస్త స్థిమితపడి, "నువ్విక్కడే-జలగ్రహం మీద వున్నావన్నమాట, బతికిపోయాను! ఈ డొక్కలో విరిగినకత్తిని ఎప్పుడు బయటికి లాగుతావు?" అన్నాడు.

"దొరా, వేగిరపడకండి! మీరు అడవి ఏనుగులమీద యుద్ధం గొడవలో, అసలు సంగతిమరిచినట్టున్నది. చరకాచార్యులు గారు, ఇక్కడెక్కడనుంచో రెండు భీతిగొల్పే



చావుకేకలు పెట్టారు. ఆయన తమకోసం మూలికలూ, ఓషధులూ తెచ్చేందుకు చెట్ల ల్లోకి వెళ్ళాడు," అన్నాడు వీరనారాయుడు.

"అవునవును! ఒకవేళ ఏ పెద్దపులో అత గాణ్ణి నోట కరుచుకుపోతే, నాడొక్కలో కత్తి అలా ఉండిపోవలసిందేనా? దాన్ని బయటికి లాగి, గాయం మానే చికిత్స నువ్వు చెయ్య లేవా?" అని అడిగాడు మొసలి ఆకారంవాడు.

ఆ ప్రశ్నకు వీరనారాయుడు పకపక మంటూ నవ్వి, "దొరా, శస్త్రచికిత్స నేర్చిన నాకు, గాయం మాన్పే మందులేతెలియవను కుంటున్నావా? బతుకుతెరువు పోటీ లేకుండా సాగిపోయేందుకు వీలుగా, నేనూ, ఆ ఆచా ర్యులూ ఒకళ్ళకు తెలిసిన వైద్యం మరొక ళ్ళకు తెలియదన్నట్టు గ్రామంలో చిన్న నాటకం ఆడుతున్నాం. అలా చెయ్యకపోతే, గ్రామస్థులు మా ఇద్దరిలో ఒకళ్ళకు తిండీ



తిప్పల సదుపాయం చూస్తూ, రెండోవాణ్ణి తరిమేస్తారు,'' అన్నాడు.

''ఒరే, కపటపు వెధవా! నువ్వు నాతోక వదిలి ముందుకురా! ఆ ఆచారి ఎక్కడు న్నాడో వెతుకుదాం,'' అంటూ మొసలి ఆకారంవాడు జలగ్రహాన్ని గట్టిగా అదిలించాడు.

అంతకు గంట ముందు చరకాచారి వేసిన కేకలు జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా విన్నారు. వాళ్ళిద్దరూ పొదలో దొరికిన తాళపత్ర గ్రంథం తీసుకుని, అక్కడ దాన్ని వదిలిన వాడికోసం అరణ్యంలో వెతుకుతున్నారు. ఆ సమయంలో వాళ్ళకు రక్షించండి, అంటూ చరకాచారి వేసిన కేకలు వినిపించినై. వాళ్ళు ఆ వైపుకు కొంతదూరం నడిచే సరికి, అడవి ఏనుగుల ఘీంకారాలూ, వాటితో వింతఏనుగు నెక్కిన మొసలి ఆకారంవాడు శూలం చేత బట్టి పోరాడుతూండటం కంటబడింది.

ఆ వెంటనే సిద్ధసాధకుడు ఆవేశపడి గెంతుతూ, చేతిలోని దండాన్ని పైకెత్తి, ''జయ శీలా! మన కనకాక్షరాజుగారి పిల్లలను ఎత్తు కుపోయిన దుర్మార్గుడు వీడే! నేను ముందే చెప్పినట్టు వీడు యక్షుడో, గంధర్వుడో, కిన్న రుడో అయివుంటాడు!'' అన్నాడు.

అంతలో మరొకసారి చరకాచారి చేసిన ఆర్తనాదం వినిపించింది. జయశీలుడు వెంటనే కత్తిదూసి, ''భయపడకు, వస్తున్నాం!'' అంటూ అటుకేసి బయలుదేరాడు.

సిద్ధసాధకుడు అయిష్టంగానే జయశీ లుణ్ణి అనుసరించాడు. ఇద్దరూ చరకాచారిని సమీపించే సమయానికి, కొండచిలువ ఒకటి అతడి శరీరాన్ని బలంగా చుట్టి నోటితో అతడి తలను వడిసి పట్టుకునేందుకు ప్రయత్ని స్తున్నది. చరకాచారి ఇంకా బతికేవున్నాడన్న సూచనగా, అతడి చేతివేళ్ళుమాత్రం కద లాడుతున్నవి.

జయశీలుడు దూకుతూ పోయి కత్తితో కొండచిలువ తలను, చరకాచారి తలనుంచి దూరంగా నెట్టేందుకు ప్రయత్నించాడు. తన కత్తి దెబ్బ, పాము శరీరం నుంచి దూసుకు పోయి మనిషికి తగులుతుందేమో అని అతడి భయం. కాని, బలమైన కొండచిలువ బాగా ఆకలిగొనివున్నదేమో—జయశీలుడి కత్తిని తలతో బలంగా పక్కకు నెట్టింది.

''జయశీలా, వీడు ఆటవికుడుకాదు, చదువు సంధ్యలు నేర్చినపండితుడిలా వున్నాడు. త్వరగా పామును చంపు!'' అన్నాడు సిద్ధసా ధకుడు, చరకాచారికేసి పరీక్షగా చూస్తూ.

జయశీలుడు కొండచిలువ తలను ఎడమ చేత్తో పట్టుకుని వెనక్కు లాగుతూ, కత్తితో

దాని తల కిందిభాగం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు సగం తల తెగిన పాము గిలగిల్లాడుతూ, చరకాచారిని చుట్టబెట్టిన శరీర భాగమంతా వూడిపోగా, జారి దభీమంటూ నేల మీద పడింది.

కొండచిలువతో పాటు కిందపడబోయిన చరకాచారిని, జయశీలుడు పట్టుకుని, "సాధకా! త్వరగా పోయి, నీళ్ళు తీసుకురా. మనిషి దిమ్మెరపోయాడు తప్ప బతికే వున్నాడు," అన్నాడు.

సిద్ధసాధకుడు పరుగు పరుగున పోయి, దాపులనున్న కొలనులోంచి కమండలంతో నీళ్ళు తీసుకుని తిరిగివచ్చాడు. జయశీలుడు ముఖంమీద నీళ్ళు చల్లగానే చరకాచారి కళ్ళు తెరిచి, "నేనెక్కడున్నాను. బతికే వున్నానా లేక కొండచిలువ పొట్టలో వున్నానా?" అన్నాడు పెద్దగా ఆయాసపడుతూ.

"నువ్వు బతికే ఉన్నావు. భయపడకు. ముందు ఈ మంత్ర జలం తాగు. నిన్ను పట్టిన నిస్త్రాణా, ప్రాణభయం పోతుంది," అంటూ సిద్ధసాధకుడు, చరకాచారి చేత నీళ్ళు తాగించాడు.

అంతవరకూ సగం మైకంలో వణికిపోతున్న చరకాచారి అప్పుడు కళ్ళు సాంతం తెరిచి, చుట్టూ కలయచూస్తూ, "మీరెవరు? ఆ మొసలి ప్రభువెక్కడ? వీరనారాయుడేమయ్యాడు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో జయశీలుడికి, చరకాచారి ఎవర్ని గురించి మాట్లాడుతున్నాడో అర్థమైపోయింది. అతడు సిద్ధసాధకుడితో, "సాధకా, ఇతడి మాటలు విన్నావా? ఆ వింత ఏనుగుపైనున్న మొసలి ఆకారంవాడితో, ఇతడికేదో నేస్తం వున్నది," అని చరకాచారితో, "నీపేరేమిటి? ఆ మొసలి ఆకారంవాడికి నువ్వు బంటువా, స్నేహితుడివా?" అని అడిగాడు.

చరకాచారి జవాబు చెప్పేలోపల మొసలి ఆకారంవాడు చెట్లచాటునుంచి ముందుకు వచ్చి, "చరకాచార్యులు నా సొంతవైద్యుడు. మీరెవరు? నిజం చెప్పకపోయారో, నా జలగ్రహంతో మిమ్మల్ని నుజ్జునుజ్జయ్యేలా తొక్కిస్తాను," అన్నాడు. జయశీలుడు చప్పున కత్తి పిడి మీద చేయివేశాడు. సిద్ధసాధకుడు కళ్ళెర్రచేసి దండం ఎత్తి పట్టుకున్నాడు. - (ఇంకావుంది)



# శేఖరం బహుమతి!

నాగేంద్రయ్య, శేఖరం ఇరుగుపొరుగు గ్రామాలవాళ్ళు. ఇద్దరూ మంచి స్నేహితులు, వ్యవసాయంలో దిట్టలు. వాళ్ళు రెండువారాలకొకసారి పొలంలో వచ్చే ఫలసాయాన్ని దాపులనున్న పట్టణంలో జరిగే సంతకు బండిమీద వేసుకుపోయి అమ్ముకొస్తూండేవాళ్ళు.

ఒకసారి ఇద్దరూ పనులు ముగించుకుని తమ గ్రామాలకు తిరుగుప్రయాణమయ్యారు. ఆ సమయంలో శేఖరానికి, ఒక బట్టల దుకాణం నుంచి పెద్ద బుట్టా, సంచీలతో బయటికి వస్తున్న నాగేంద్రయ్య కనిపించాడు. శేఖరం అతణ్ణి సమీపించి, "ఏమిటీ సరంజామా అంతా! ఏం కొన్నావేమిటి?" అని అడిగాడు.

నాగేంద్రయ్య, భార్యకోసం రెండు చీరెలూ, ఇన్నిమల్లెలూ, గులాబీలతోపాటు; వేలికి ఒక బంగారు ఉంగరం కూడా కొన్నాడు.

"ఇవన్నీ మనం కొని ఇంటికి తీసుకుపోవాలా? కాస్త తీరిక చిక్కినప్పుడు మన ఆడవాళ్ళే కొనుక్కు పోగలరు కదా? ఇదంతా బరువు చేటు," అన్నాడు శేఖరం.

ఆ మాటలకు నాగేంద్రయ్య నవ్వి, "బరువుచేటెలా అవుతుంది, శేఖరం? భర్తకోసం, కన్నబిడ్డల కోసం ఇళ్ళల్లో వాళ్ళెంత శ్రమపడుతూంటారు! ఇలాంటి చిన్నచిన్న బహుమతులు, అడక్కుండానే మనకై మనం ఇవ్వడమంటే, వాళ్ళనెంతో మెచ్చుకున్నట్టవుతుంది. ఎంతో సంతోషిస్తారు," అన్నాడు.

శేఖరం ఒక్క క్షణం "ఔరా!" అన్నట్టు నాగేంద్రయ్యకేసి చూసి, "ఏనాడూ నాకింత మంచి ఆలోచన రాలేదు!" అంటూ దుకాణంలోకి పోయి, నాగేంద్రయ్య కొన్న వస్తువుల్లాంటివే కొని, ఇల్లు చేరి ఉత్సాహంగా తలుపు తట్టాడు.

శేఖరం భార్య తలుపు తెరుస్తూనే, భర్త కొని తెచ్చిన వస్తువులకేసి చూసి, కళ్ళనీళ్ళు పెట్టుకుని, "తెల్లవారి లేస్తూ ఎవరి ముఖం చూశానో అన్నీ బాధలే. శ్యామును వీధిలో పిల్లలు కొట్టి చొక్కా చింపేశారు, పసిది పక్కింటివాళ్ళ పిల్లిని పట్టుకోపోతే, అది గోళ్ళతో దాని చేతుల్ని చీరింది. చేద తెగి కడవ బావిలో పడి పోయింది–ఇప్పుడు మీరు, పొలం పంట అమ్మగా వచ్చిన డబ్బంతా ఖర్చుచేసి, ఏనాడూ లేనిది– ఏవేవో వస్తువులు కొనితెచ్చారు! మనం చాలా డబ్బు అవసరంలో వున్నామని తెలియదా?" అంటూ, కళ్ళనీళ్ళు తుడుచుకున్నది.





బేతాళ కథలు

# మాతృదేవత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగేమౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా! లోకంలో చాలా మంది, మధ్యలో కార్యభంగం జరగవచ్చునన్న భయంతో, అసలు ఏకార్యం సాధించేందుకూ పట్టుదలతో పూనుకోరు. నువ్వు అలాంటి వ్యక్తులకు భిన్నమైన వాడివి! కానీ, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొలిపే శ్మశానంలో నువ్వు పడుతున్న ఇక్కట్లు చూస్తూంటే, ఇది ఏ మాత్రం రాజోచితంగా కనిపించడంలేదు. ఒక్కొక్కసారి ఎంతో వివేక



వంతులు కూడా, తాము భక్తిశ్రద్ధలతో ఆరాధించేవారి కారణంగా అనవసరమైన శ్రమలకు గురికావడం జరుగుతుంటుంది. ఇందుకు ఉదాహరణగా, వార్ధక్యం వల్ల వివేకాన్నీ, తార్కికదృష్టినీ కోల్పోయిన అంగదుడనే ముని కథా, అతణ్ణి నమ్మిన విశ్వేశ్వరుడనే వాడి కథా చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

రత్నగిరి నగరంలో, రత్నగుప్తుడనే భాగ్యవంతుడుండేవాడు. ఆయన భార్య రత్నావతి. ఇద్దరూ ధర్మగుణానికీ, దైవభక్తికీ పేరు పొందారు. అయినా కొన్నేళ్ళవరకు వారికి సంతానం కలగలేదు. ఎన్నో నోములు నోచగా వారికి కొన్ని సంవత్సరాల తరవాత పుట్టిన పాపకు అన్నపూర్ణ అని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచసాగారు. అప్పటి నుంచీ అన్నపూర్ణే లోకంగా జీవిస్తున్న ఆ దంపతులకు అమిత దుఃఖాన్ని కలిగిస్తూ- ఆమెకు ఐదేళ్ళ వయసులో అంతుపట్టని వ్యాధి సోకింది.

అన్నపూర్ణకు ఏం తిన్నా సహించదు. తిన్నది జీర్ణంకాదు. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం భరించరాని తలనొప్పి వచ్చి బాధతో మెలికలు తిరిగిపోయేది. అప్పుడప్పుడూ కడుపు నొప్పి అని ఏడ్చేది. ఎంతమంది వైద్యులకు చూపించినా ఫలితం కనిపించకపోగా, రత్నగుప్తుడు సమీపారణ్యంలో వుంటున్న అంగదుడనే మునికి తన గోడు చెప్పుకున్నాడు.

అంగదుడు కొద్దిసేపు ధ్యానంలో వుండి కళ్ళు తెరిచి, ''కూతురు పుట్టాక ఆమెపట్ల అనురాగం కారణంగా నీలో దైవచింతన క్రమంగా తగ్గింది. నీ కూతురు వ్యాధి భగవంతుడి నుంచి నీకొక హెచ్చరిక. ఇకమీదటనైనా ఆమెలో దైవచింతన కలిగించు. తల్లిదండ్రుల కంటే కూడా దేవుడే గొప్పవాడని ఆమె అనుకునేలా చేయి. పరిస్థితి చక్కబడుతుంది,'' అని చెప్పాడు.

రత్నగుప్తుడు, అంగదుడు చెప్పింది పాటించాడు. ఆనాటినుంచీ అన్నపూర్ణ భక్తిశ్రద్ధలతో దైవపూజ చేసేది. ఆ ఏకాగ్రతలో ఆమెకు తలనొప్పి తెలిసేదికాదు. ఆహారంగా ఏమిచ్చినా దేవుడి ప్రసాదంగా భావించి తినేది. నెల రోజుల్లోనే ఆమె జబ్బు క్రమంగా తగ్గిపోయింది. కానీ బాలధ్రువుడిలా, భక్త ప్రహ్లాదుడిలా అహర్నిశలూ దైవధ్యానంలో ఉండసాగింది.

అన్నపూర్ణకు దైవభక్తికూడా జబ్బులా పట్టుకునేసరికి రత్నగుప్తుడికి ఎంతో బాధ

కలిగింది. క్రమంగా ఆమె యుక్తవయస్కు రాలయింది. తండ్రి ఆమెకు పెళ్ళి సంబంధాలు చూడబోతే, "నా జీవితం ఆ దేవుడికే అంకితం. నాకు పెళ్ళివద్దు!" అని ఖచ్చితంగా చెప్పేసింది.

నయానా భయానా కూతుర్ని ఒప్పించలేక, చివరకు రత్నగుప్తుడు మళ్ళీ అంగదుణ్ణి కలుసుకుని, సంగతి చెప్పి తన ఇంటికి ఆహ్వానించాడు.

అంగదుడు అన్నపూర్ణతో, "ప్రతిమనిషిలోనూ దేవుడున్నాడు. నువ్వు మనిషిలో దేవుణ్ణి చూడాలంటే నీ తలిదండ్రులు నిర్ణయించిన వాణ్ణి పెళ్ళిచేసుకో. నీ భర్తనే దేవుడిలా చూసుకో. అప్పుడు దేవుడికి నీపై కరుణ కలిగి, నువ్వు కనబోయే బిడ్డకు తన అంశ కలిగిస్తాడు," అన్నాడు.

అమ్మ కావాలన్న కోరిక స్త్రీ సహజం. అన్నపూర్ణ పెళ్ళికి ఒప్పుకున్నది. ఆమె గుణగణాలు తెలుసుకుని, వైభవుడనే ఒకసంపన్న వ్యాపారి యువకుడు, ఆమెను పెళ్ళిచేసుకున్నాడు. కొన్నాళ్ళకు అన్నపూర్ణ కడుపు పండి చక్కని మగబిడ్డ పుట్టాడు. ఆ బిడ్డ దేవుడికి మారురూపమని అన్నపూర్ణ మురిసిపోతే, భర్త ఎంతో ఆనందం చెంది ఆ బిడ్డకు విశ్వేశ్వరుడని పేరు పెట్టాడు.

తల్లిప్రేమను చవిచూస్తూనే దైవపూజల మధ్య భక్తి వాతావరణంలో పెరుగుతున్న విశ్వేశ్వరుడికి, ఊహ తెలిసే వయసుకే ఐహిక సుఖాలమీద విరక్తి పుట్టింది. దైవదర్శనానికై తపించిపోతూ, మోక్షమార్గాన్వేషించే తన బిడ్డ అందరు పిల్లల్లా లేడని, అన్నపూర్ణ తరచూ బాధపడుతూండేది.



అది గమనించిన వైభవుడామెతో, "అబ్బాయిలో మితిమీరిన దైవభక్తిని ప్రవేశపెట్టిందే నువ్వు. వాడిని దేవుడికి కాస్త దూరంగా వుంచు," అన్నాడు.

అన్నపూర్ణకు ఈ సూచన నచ్చి, "ఏ వయసుకాముచ్చట వుండాలి. నీవిక దైవపూజలు మాని అందరి పిల్లల్లా ఆటపాటల్లోనూ, చదువుమీదా దృష్టి పెట్టాలి!" అని కొడుకును శాసించింది.

తల్లి మాటలు పాటించడం విశ్వేశ్వరుడి వల్లకాలేదు. అతడు తన గోడు ఎవరికి చెప్పుకున్నా, అంతా తల్లినే సమర్థిస్తూంటే విసిగిపోయి, సమీపారణ్యానికి వెళ్ళి ఒక చెట్టు కింద తపస్సు ప్రారంభించాడు. అతడిలో దైవాంశ ఉన్నదో, మరి తల్లిప్రేమ గొప్పతనమో కానీ, ఆ అరణ్యంలో అతడిపై ఏ క్రూరమృగమూ దాడిచెయ్యలేదు. ఏ విషసర్పమూ

అతణ్ణి కాటు వెయ్యలేదు. ఆకలి అయిన ప్పుడు తలచుకుంటే చాలు ఏ చెట్టుకోపండు కనబడేది.

విశ్వేశ్వరుడివన్నీ గుర్తించలేదు. అతడికి పరిసరాల స్పృహలేదు. ఇల్లు విడిచినప్పుడు అతడికి పదేళ్ళు. అరణ్యంలో అతడు పదేళ్ళ పాటు తన తపస్సు కొనసాగించాడు. అయినా, దేవుడు ప్రత్యక్షం కాలేదు.

ఒకరోజు ఉదయానే యధాప్రకారం నిద్ర లేచి విశ్వేశ్వరుడు కొలనులో స్నానం చేస్తు న్నాడు. ఆ సమయంలో వేటగాడొకడు జింకను తరుముతూ అటుగా వచ్చి, అతణ్ణి చూసి ఆశ్చ ర్యంగా, "పరమేశ్వరా! అలనాడు అర్జును డికిచ్చినట్లే, ఈనాడు నాకు దర్శనమిచ్చావా? ఏమి నా మహాభాగ్యం!" అంటూ చేతులు జోడించాడు.

అప్పుడు విశ్వేశ్వరుడు కొలనులోంచి ఒడ్డుకువచ్చి, "అయ్యా! తమరెవరో కానీ వయసులో నాకంటే పెద్దవారు. నాకు నమస్క రించకూడదు," అన్నాడు.

దానికి వేటగాడు, "నీ ముఖాన సూర్య తేజమున్నది. మెడలో సర్పహారమున్నది. నీ దర్శనంతో నా జన్మ ధన్యమైంది. నీకు చేతులు జోడించడమేమిటి, పాదాభివదనం చేయాలి!" అంటూ విశ్వేశ్వరుడి ముందు సాష్టాంగపడ్డాడు.

విశ్వేశ్వరుడు నివ్వెరపోయి తల, మెడ తడుముకుంటే అంతా మామూలుగానే వున్నది. అతడు ఏదో అనబోయేంతలో, వేట గాడు, "హా, స్వామి నన్ను కరుణించి మాయ మయ్యాడు. నాకంటే అదృష్టవంతుడీ భూమ్మీద వుండడు," అంటూ, విశ్వేశ్వరుడు ఎదట వున్నా లేనట్లే ప్రవర్తిస్తూ అక్కణ్ణించి వెళ్ళి పోయాడు.

"నేనేమిటి? పరమేశ్వరుడేమిటి? నన్ను కానీ దేవుడావహించి నాకు కనబడకుండా, ఇతరులకు కనబడుతున్నాడా?" అంటూ



అయోమయంలో పడిన విశ్వేశ్వరుడు, చాలా సేపు తీవ్రంగా ఆలోచించిన తరవాత నిజానిజాలు తెలుసుకునేందుకు అక్కడి నుంచి బయలుదేరి మనుషుల మధ్యకు వెళ్ళాలనుకున్నాడు.

ఆవిధంగా అతడు రత్నగిరివైపు వెళుతూండగా, దారిలో ముని అంగదుడు ఎదురయ్యాడు. ఆయనలో ఇప్పుడు వార్ధక్యపు ఛాయలు బాగా కనబడుతున్నాయి. విశ్వేశ్వరుడు రత్నగిరి వెళుతున్నాడని తెలుసుకుని, "నాయనా! దైవసాక్షాత్కారం పొందిన అనుభూతి గతంలో నాకు ఏడాదికొక్కసారైనా కలిగేది. కానీ పది సంవత్సరాలుగా నాకు దేవుడి జాడ తెలియకుండా పోయింది. రత్నగిరిలో అన్నపూర్ణ అనే ఉత్తమ ఇల్లాలున్నది. ఆమెకు విశ్వేశ్వరుడనే ఉత్తముడు పుత్రుడుగా జన్మించాడు. అతణ్ణి కలుసుకుంటే నా సమస్యకు పరిష్కారం లభిస్తుందని ఒక దేవత కలలో చెప్పింది. ఆ ప్రకారం ప్రతి ఏటా రత్నగిరి వెళ్ళి విశ్వేశ్వరుణ్ణి కలుసుకుని వస్తున్నాను. కానీ నా సమస్య అలాగే వుంది. నీవు రత్నగిరి చేరాక, ఆ విశ్వేశ్వరుణ్ణి చూసి, నా సమస్య వివరించు. వృద్ధాప్యం కారణంగా కొద్దిగా అనారోగ్యంతో వున్న నేను, ఇప్పట్లో కలుసుకోలేననీ, తను చెప్పవలసినదేమైనా వుంటే సందేశం పంపమనీ అతడికి చెప్పు," అన్నాడు.

అంగదుడు తనలో పరమేశ్వరుణ్ణి దర్శించినందుకు స్థిమితపడినా, ఆయన మాటలు విశ్వేశ్వరుణ్ణి మరింత అయోమయంలో పడవేశాయి. అతడు, అంగదుడికి మొత్తం జరిగిందంతా చెప్పి, "పదేళ్ళుగా నేను అరణ్యంలో



ఒంటరిగా తపస్సు చేస్తూంటే, మీరు నన్ను కొన్నేళ్ళుగా రత్నగిరిలోని మా ఇంట కలుసుకోగలగడం ఎలా సాధ్యం?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

అప్పుడు అంగదుడు, విశ్వేశ్వరుణ్ణి నిశితంగా చూసి, "నాకు చూపు సరిగ్గా ఆనక ఇంతవరకూ గుర్తించలేకపోయాను. నిన్నే నేను మీ ఇంట కలుస్తూ వచ్చాను. ఇప్పుడు నాకంతా అర్థమైంది. తన బిడ్డలో దేవుణ్ణి చూసుకున్న మీ అమ్మను విడిచిపెట్టావు నువ్వు. తన భక్తురాలికి మనోక్లేశం కలగకుండా, ఆ పరమేశ్వరుడే నీ రూపం ధరించి ఆమెవద్దకు వెళ్ళి ఉన్నాడు. అయ్యో, నేను మీ ఇంటికి వెళ్ళి దేవుణ్ణి దర్శించుకుని కూడా, ఆ విషయం గ్రహించలేని మూర్ఖుడినయ్యాను," అని క్షణంపాటు బాధపడి, "దేవుడు, వేటగాడి రూపంలో నిన్ను నీ ఇంటికి

మళ్ళించాడు. పదేళ్ళ తపస్సు తర్వాత నీకు దైవసాక్షాత్కారం లభించింది. ఇక ఇంటికి వెళ్ళు. పరమాత్మనే మైమరపించిన మాతృ ప్రేమకు పదేళ్ళు దూరమైనావు. ఇకనైనా మాతృదేవతలో దైవాన్ని చూస్తూ శేషజీవితాన్ని గడుపు," అన్నాడు.

విశ్వేశ్వరుడు మారు పలకకుండా, ముని అంగదుడికి పాదాభివందనం చేసి, వేగంగా ఇంటిదారి పట్టాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! విశ్వేశ్వరుడి జీవితధ్యేయం తపస్సుచేసి దైవ సాక్షాత్కారం పొందడం. అందుకుగాను అతడు ఐహిక సుఖాలనూ, మాతృప్రేమనూ కూడా త్యజించి అరణ్యానికి వెళ్ళాడు. అలాంటి దైవచింతనాపరుడికి, ముని అంగదుడు, మాతృమూర్తే దైవమంటూ బోధించి, ఇంటికి తిరిగి వెళ్ళమనడంలో, ఏవిధమైన ధార్మిక చింతన గాని, తార్కికదృష్టిగాని కనిపించడం లేదుగదా? అతడి ఈ అసందర్భ ప్రవర్తనకు అనారోగ్యం, మితిమించిన వయోభారం కారణాలా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీతల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవుడు తాను కరుణించి సాక్షాత్కరించదలచినప్పుడు, భక్తుడికి ఏ రూపంలో అయినా కనిపించవచ్చు. విశ్వేశ్వరుడికాయన వేటగాడి రూపంలో సాక్షాత్కరించాడు. ఆ సంగతి అతడు గ్రహించలేకపోయాడు. విశ్వేశ్వరుడిద్వారా అరణ్యంలో జరిగినదంతా విన్న ముని అంగదుడు, అతడికి వేటగాడి రూపంలో దైవసాక్షాత్కారం జరిగిందనీ ఆ విధంగా తపస్సు ఫలించిందనీ చెప్పవలసి వచ్చింది. ఆ తర్వాత విశ్వేశ్వరుడు ఇంకా అరణ్యంలో కాలం గడపడం అనేది, అనుచితకార్యమవుతుంది. అందువల్లనే అంగదుడు, అతడికి మాతృదేవతలో దైవాన్ని చూస్తూ శేషజీవితాన్ని గడపమని బోధించడంజరిగింది. ఇది అంగదుడి ధార్మిక, ఆధ్యాత్మిక పరిపక్వతను సూచిస్తుంది తప్ప, అతడి వయోభారాన్నీ, అనారోగ్యాన్నీ మాత్రం కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



మన పూర్వగాథలు:

# వింత ఆతిథ్యం!




ఒకానొకప్పుడు ఇల్వలుడు, వాతాపి అనే రాక్షస సోదరులు ఇద్దరు ఒక అరణ్య సమీపంలో నివసిస్తూ వుండేవారు. ఆ అన్నదమ్ములిరువురూ కామరూపులు. అంటే, కోరిన రూపం పొందగల శక్తి కలిగినవారు.

పరుల ధనం అంటే వాళ్ళకు చెప్పలేనంత వ్యామోహం. కోరిన కోరికలు తీర్చే మంత్రం ఉపదేశించమని వాళ్ళు, కొందరు బ్రాహ్మణులను ఆశ్రయించారు. అయితే ఆ కోరిక నెరవేరలేదు. అందువల్ల పరులధనం దొంగిలించడానికి అన్నదమ్ములు సరికొత్త పథకాన్ని రూపొందించారు.

ఇల్వలుడు పరమభక్తుడైన గృహస్థు రూపం ధరించి, నగరానికి వెళ్ళే మార్గంలో నిలబడేవాడు. ఆ దారివెంట వెళ్ళే, ధనికులైన వ్యాపారులనూ, బ్రాహ్మణులనూ, తమ ఇంట కాస్సేపు విశ్రాంతి తీసుకుని, తమ ఆతిథ్యం స్వీకరించి వెళ్ళమని ఆప్యాయంగా పిలిచేవాడు. అతడి సాత్వికరూపం చూసిన ఎవరికీ అతడి ఉద్దేశంపట్ల ఎలాంటి అనుమానమూ కలిగేది కాదు. అతడివెంట సంతోషంగా వెళ్ళేవారు.

ఇల్వలుడు వాళ్ళను సాదరంగా తీసుకు వెళ్ళి, స్నానం చేయడానికి ఇంటివెనక ఉన్న చల్లని తటాకాన్ని చూపేవాడు. స్నానంచేసి వచ్చాక వాళ్ళను కూర్చోబెట్టి వాళ్ళకోసం ప్రత్యేకంగా వంట చేస్తానని లోపలికి వెళ్ళేవాడు.

నిజంగానే అది ప్రత్యేకమైన భోజనమే. ఎందుకంటే అది మేకపిల్ల మాంసంతో తయారయ్యే భోజనం. ఆ మేక మామూలు మేక కాదు; ఇల్వలుడి తమ్ముడు వాతాపి! మేకగా మారిపోయే వాణ్ణి ఇల్వలుడు చంపి వంట చేసేవాడు. అయితే, ఆ సంగతి వచ్చినవారికి తెలిసేది కాదు. సంతోషంగా భోజనం చేసేవారు.

భోజనం అయ్యాక, ఇల్వలుడు ఉన్నట్టుండి తన తమ్ముణ్ణి తలుచుకున్నట్టు

బిందుసార్



నటించి, "వాతాపీ! తమ్ముడూ నువ్వెక్కడు న్నావు? ఆలస్యమవుతోంది, వెంటనే రా!" అని గొంతెత్తి పిలిచేవాడు.

అతిథులకు కడుపు తిప్పినట్టయి, క్షణంలో చెప్పరాని బాధ మొదలయ్యేది. ఏం జరుగు తున్నదో గ్రహించేలోపలే, కడుపు బద్దలై మాంసం ముక్కలు బయటపడేవి. వాటన్ని టినీ ఒకటిగా చేర్చి, ఇల్వలుడు ఏదో మంత్రం చెప్పేవాడు. చచ్చిపడివున్న అతిథిని చూసి వికటాట్టహాసం చేస్తూ, వాతాపి ప్రాణాలతో లేచేవాడు. ఆ తరవాత అన్నదమ్ములిద్దరూ కలిసి, అతిథి దగ్గరున్న ధనాన్ని దోచుకుని, శవాన్ని తీసుకెళ్ళి ఇంటి వెనక ఉన్న పెద్ద గోతిలో పాతిపెట్టేవారు.

ఇలా చేయడంవల్ల, కొన్నాళ్ళకు ఈ రాక్షస సోదరులు ఆ ప్రాంతంలోనే గొప్ప ధనవంతులుగా మారారు. ఇంత త్వరలో అంత గొప్ప ధనవంతులుగా ఎలా అయ్యారా అని చుట్టుపక్కలవాళ్ళు ఆశ్చర్యపడసాగారు. ఇంటి దాపులలో వేరొక ఇల్లు లేకపోవడం వల్ల అక్కడ జరిగే అసలు కథ మరో కంటికి తెలిసేది కాదు.

ఇలా ఉండగా, ఒకసారి అగస్త్య మునికి కొంత ధనం కావలసి వచ్చి, కొందరు ధనికుల దగ్గరికి వెళ్ళి ధనసహాయం అర్థించాడు. వాళ్ళు సాయంచేడానికిసిద్ధంగా ఉన్నప్పటికీ, అరణ్య సమీపంలో తమకన్నా ధనవంతులుగా ఉన్న ఇల్వల వాతాపి సోదరుల దగ్గరికి వెళితే, కోరినంత ధనం లభిస్తుందని అగస్త్యమునికి సూచించారు.

అగస్త్యుడు రాక్షస సోదరుల దగ్గరికి వెళ్ళాడు. వాళ్ళు ఆయన్ను చూడగానే చిరు నవ్వుతో చేతులెత్తి నమస్కరిస్తూ, "ముని సత్తమా! తమ రాకతో మా ఇల్లు పావనమ యింది, రండి, రండి," అంటూ భక్తిశ్రద్ధలతో స్వాగతం పలికారు.

"మీముఖంలోని తేజస్సునుచూస్తూంటే, మీరు సంపదలతో తులతూగుతున్నట్టున్నది. నిజమే కదా!" అన్నాడు అగస్త్యుడు ఇంట్లోకి అడుగుపెడుతూ.

"అవును, అంతా తమ బోటి పెద్దల దయ. నిజానికి సంపదలన్నిటికీ మూలం, తమ వంటి పుణ్యాత్ముల ఆశీర్వాదమే!" అన్నాడు ఇల్వలుడు. ఒక విధంగా వాడి మాటలూ నిజమేకదా!

అంతలో వాతాపి అక్కడి నుంచి మెల్లగా జారుకున్నాడు.

"మునివర్యా! కొంతసేపు విశ్రాంతి తీసు కోండి. మీ కోసం ఒక లేత మేకను కోసి,

మంచి విందుభోజనం ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు ఇల్వలుడు, పెరట్లో మేకపిల్లగా మారి అరుస్తూన్న వాతాపికేసి చూస్తూ.

'' ఆ మూగజీవి మరణానికి, నేను కారణం కావాలా? శాకాహారం ఏదీ లేదా?'' అన్నాడు అగస్త్యుడు.

''మహాత్మా తమరు భుజించినా ఆ మేక నాకు ఉన్నట్టే లెక్క. అతిథులకు ఆనందం కలిగించే భాగ్యం అందరికీ లభించదుకదా!'' అన్నాడు ఇల్వలుడు.

కొంతసేపటికంతా ఇల్వలుడు మేకను చంపి, వండి మునికి వడ్డించాడు. అగస్త్యుడు కూర్చుని భోజనం ముగించి, 'జీర్ణం, వాతాపి జీర్ణం,' అని మనసులో అనుకుంటూ పొట్టను చేత్తో తడివాడు. ఆ తరవాత, ''చాలా సంతోషం నాయనా! రుచిగా ఉంది,'' అన్నాడు ఇల్వలుడితో.

''నిజమే మునీంద్రా! ఒక్కసారి మా ఇంట ఈ భోజనం చేస్తే, మళ్ళీ జీవితంలో ఆ భోజనం అవసరమే ఉండదు,'' అంటూ ఇల్వలుడు గట్టిగా నవ్వాడు. ఆ తరవాత ఆశతో తమ్ముణ్ణి కేకవేసి పిలిచాడు.

''వాతాపీ! బయటకు వచ్చే సమయం ఆసన్నమయింది. ఆలస్యం ఎందుకు? రా, సోదరా, రా!'' అంటూ తమ్ముణ్ణి మళ్ళీ మళ్ళీ పిలవసాగాడు.

అయినా, అతిథి పొట్ట పగిలే సూచనలు కనిపించలేదు. ఆశ్చర్యమూ, భయమూ నిండిన మనసుతో, మునిని మరింత సమీపించి, ఆయన పొట్టను మరింత పరిశీలనగా చూశాడు.

''మిత్రమా! నీ సోదరుడు ఇక తిరిగి రాడు. వాణ్ణి నిశ్శేషంగా జీర్ణం చేసేశాను,'' అన్నాడు ముని ప్రశాంతంగా.

ఇల్వలుడు భయకంపితుడైపోయి, క్షమించమని ముని పాదాలపైబడ్డాడు. ఆయనకు కావలసినంత ధనం ఇచ్చి, ఇక మీదట వంచనాపూరితమైన ఎలాంటి దుర్మార్గానికీ పాల్పడనని ప్రమాణం చేశాడు.

అగస్త్యముని కారణంగా రాక్షస సోదరుల దారుణ మోసకృత్యాలు అంతమయ్యాయి. రాక్షసుల కుతంత్రాలు, మాయామంత్ర జాలాలకన్నా మునుల తపోబలం గొప్పదని రుజువయింది!



# మనదేశం గురించి తెలుసుకుందాం

క్విజ్

వేసవి సెలవులు వచ్చేశాయి. ఇంచుమించు రెండు నెలల పాటు పిల్లలకు చదువుల బాదరబందీ లేదు. చాలామంది ఇతర ప్రాంతాలకు వెళుతూంటారు. అందుకే ఈనెల క్విజ్‌లో కొన్ని పర్యాటక ప్రదేశాల గురించి తెలుసుకుందాం.

1. కర్నాటకలోని గుల్బర్గ ఒకప్పుడు ఒక రాజ్యానికి రాజధాని. ఆ రాజ్యం పేరేమిటో తెలుసా?దానిని ఎవరు స్థాపించారు? ఎప్పుడు?
2. రెండు దీవుల సముదాయాన్ని ఒక కాలువ విడదీస్తోంది. కాలువ పేరేమిటి? ఆ దీవులు ఏవి?
3. సుప్రసిద్ధ యాత్రీకుడు ఇబన్ బటూటా, తూర్పు భారతదేశంలోని ఒక నగరాన్ని అల్-కటక అని ప్రస్తావించాడు.దాని ఇప్పటి పేరేమిటి?
4. సుప్రసిద్ధ ఆంగ్లరచయిత రడ్యార్డ్ కిప్లింగ్ మనదేశంలోని ఒక నగరంలో పుట్టాడు. ఆ నగరం ఏది?
5. మన మహానగరాలలో ఒకదాని పూర్వ నామం షాజహానాబాద్. ఆ నగరం ఏదో తెలుసా?
6. మరో మహానగరాన్ని అలీనగర్ అనేవారు. ఏ నగరాన్ని?
7. పాండ్యరాజుల రాజధానీ నగరం గుండా ఒక నది ప్రవహించేది. ఆ నగరం ఏది? నది పేరేమిటి?
8. రామేశ్వరం ప్రధాన భూభాగంలో లేదు. ఆ దీవికీ ప్రధాన భూభాగానికీ మధ్య ఉన్న జలసంధి పేరేమిటో తెలుసా?

[సమాధానాలు వచ్చే సంచికలో]

## ఏప్రిల్ క్విజ్ సమాధానాలు

1. 1980 - రోమ్.
2. క్రిస్టియన్ మెడికల్ కాలేజ్, వేలూర్.
3. స్వతంత్ర రాజ్యంలో.
4. కరాచీ(అప్పుడు ఇండియాలోఉండేది).
5. గోదావరి.
6. ఎ.బి. వాజ్‌పేయి.
7. సింహం.
8. దక్షిణ గంగోత్రి.
9. హైదరాబాద్‌లోని బేగంపేట.
10. అండమాన్ నికోబార్ దీవులసముదాయంలోని బంజరుభూమి.



# ఉపకారబుద్ధి

సీతారామయ్యవైద్యుడు కాదుకానీ తల నొప్పికి
మాత్రం ఆయనకు చిట్కావైద్యం తెలుసు.
మామూలుగా దొరికే ఆకులను కోసితెచ్చి,
సరైనపాళ్ళలో తూకం వేసి కలిపి నూరితే వచ్చిన
పలచని ముద్దనాయన నుదుటికి పట్టీగా వేస్తే,
కొద్దిక్షణాల్లోనే తల నొప్పి చేత్తో తీసేసినట్టు
మాయమవుతుంది.

రోజుకొక్కరైనా చిట్కావైద్యం కోసం సీతా
రామయ్య ఇంటికి రావడం జరుగుతూం
టుంది. అలా వచ్చినవాళ్ళను త్రాసు తెచ్చు
కోమని చెప్పి, ఆయన పెరట్లోకి వెళ్ళి మొక్కల
ఆకులు కోసి తెస్తాడు. తన వైద్యానికాయన
ప్రతిఫలం అడగడు. కానీ వచ్చిన వాళ్ళు డబ్బు
కాకపోయినా ఏదైనా వస్తువో, ధాన్యమో, ఫలమో
ఆయనకు కానుకగా ఇచ్చి వెళుతూంటారు.

సీతారామయ్య ఇంటికెదురుగా ఊద
లయ్య ఉంటున్నాడు. అతడు ఉపకార బుద్ధికి
బాగా పేరుపడ్డాడు. ఎవరు సాయమడిగినా తన
కున్నంతలో లేదనకుండా ఇస్తాడు. ఊళ్ళో ఎవ
రింట వేడుక జరిగినా వెళ్ళి పనిసాయం చేస్తాడు.

ఊదలయ్యకు ఊరగాయల వ్యాపార
ముంది. కాలానుగుణంగా అతడు తయారు
చేసే రకరకాల పచ్చళ్ళకు, ఉన్న ఊళ్ళోనే గాక
పట్నంలోనూ మంచి గిరాకీ వుంది. తమ
ఇళ్ళల్లో ఎంత ప్రయత్నించినా ఊదలయ్య
పచ్చళ్ళరుచి రాదని అంతా చెప్పుకుంటారు.
తన పచ్చళ్ళ పాళ్ళను ఊదలయ్య వ్యాపార
రహస్యంగా దాచాడు. పచ్చళ్ళలో పాళ్ళు సరిగ్గా
పడాలని, అతడు త్రాసు వాడతాడు. అతడి
ఇంట త్రాసు వుండడంవల్ల, సీతారామయ్య
ఇంటికొచ్చినవారెవ్వరూ సొంత త్రాసు తెచ్చు
కోక, ఊదలయ్యనే అడిగి తీసుకుంటారు.

అంతవరకూ బాగానేవుంది! కానీ వైద్యం
చేసిన తనకంటే, త్రాసు ఇచ్చిన ఊదలయ్యనే
అందరూ ఎక్కువగా మెచ్చుకోవడం సీతా
రామయ్య మనసుకు కష్టంగా తోచేది. అలా
గని, నోరు విడిచి తననే పొగడమని ఎవర్నీ
అడగలేడుకదా! అందువల్ల, సీతారామయ్య
మనసులో ఊదలయ్య పట్ల ద్వేషభావం
పెరగసాగింది. ఈ ఊదలయ్యకు అంత పేరు

శ్రీరామకమల్



ఎందుకు వస్తున్నదని, సీతారామయ్య కొంత కాలంపాటు అతణ్ణి ఎంతో శ్రద్ధగా గమనించి, కొన్ని విషయాలు తెలుసుకున్నాడు.

ఊదలయ్య ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు. దేనికీ చిరాకు పడడు. ఎదుటివారిని పల్లెత్తు మాట అనడు. అయితే, వ్యాపార విషయంలో మాత్రం చాలా ఖచ్చితంగా వుంటాడు. తను చెప్పిన ధరకు పైసా తగ్గించడు. పచ్చళ్ళు అరువుగా ఇవ్వడు. అతడేసాయం చేసినా డబ్బు ఖర్చులేనిదే! ఉచితంగా సలహాలిస్తాడు. అవసరమైన చోటుకు వెళ్ళి పనులు చేస్తాడు. పట్నం వెళ్ళినప్పుడల్లా అడిగినవారికి వారిచ్చిన డబ్బుతో సరుకులు కొనితెస్తాడు.

తనేమో డబ్బడక్కుండా వైద్యం చేస్తున్నా, ఒక్కరూ తన ఉపకారబుద్ధిని ప్రస్తావించడం లేదు. ఈ మధ్యనే కొత్తగా ఆ ఊరుకు రావడం వల్ల, తనకింకా ఊదలయ్య గురించి అన్ని విషయాలూ తెలుసుకోలేకపోయానని, సీతారామయ్య అనుకున్నాడు. కానీ ఆయన మనసులో మాత్రం ఏదో ఒక రోజున ఊరివారందరూ తన ఉపకారబుద్ధిని పొగిడి, ఊదలయ్య పచ్చివ్యాపారి, స్వార్థపరుడని ఆడిపోసుకోగలరన్న ఆశవున్నది.

ఇలా వుండగా—ఒకరోజున సీతారామయ్యకు తలనొప్పి వచ్చింది. కణతలు నొక్కుకున్నా, మజ్జిగ దాహం పుచ్చుకున్నా కూడా అది తగ్గలేదు. చివరికాయన తన మందు తయారుచేసుకోకతప్పదని గ్రహించి, ఆకులు కోయడానికి పెరట్లోకి వెళుతూ, కూతుర్ని ఊదలయ్య ఇంటికి పంపాడు తక్కెడకోసం.

సీతారామయ్య ఆకులు కోయడం ఇంకా పూర్తికాలేదు. ఈ లోపల కూతురు తిరిగి వచ్చి, ఊదలయ్య తక్కెడ లేదన్నాడని ఆయనతో చెప్పింది.

"పోనీ, ఎవరికైనా ఇచ్చాడేమో కనుక్కోలేకపోయావా?" అన్నాడు సీతారామయ్య.

"అడిగేదాన్నే, నాన్నా! కానీ లోపలిగదిలో ఆయన భార్య తక్కెడ వాడుతున్నట్టు, నేను కనిపెట్టాను. మనకివ్వడం ఇష్టంలేక లేదన్నాడని తెలిశాక, ఎవరికైనా ఇచ్చావా అని ఎలా అడిగేది?" అన్నది సీతారామయ్య కూతురు.

మామూలుగా అయితే, కూతురు చెప్పిందానికి ఏమనేవాడోకానీ, ఇప్పుడు సీతారామయ్య తలకు తన మందుపట్టీ వేసుకోవాలని తహతహలాడిపోతున్నాడు. ఆ కారణంగా, ఆయన, "వాళ్ళు బాగా అవసరంలో వున్నట్టున్నారు! ఒక్కసారి ఇస్తే, మనం త్వరగా తిరిగి ఇచ్చేస్తామని చెప్పలేకపోయావా?" అన్నాడు.

"అనేదాన్నే. కానీ వాళ్ళు తక్కెడ లేదన్నారే తప్ప, ఆ సమయంలో దాన్ని వాడుతున్నామని అనలేదుకదా!" అన్నది సీతారామయ్యకూతురు.

అప్పటికి సీతారామయ్యకు పరిస్థితి అర్థమైంది. ఊరికి ఉపకారిగా పేరుబడ్డ ఊదలయ్య, అందరికీ తక్కెడ ఇచ్చినా, తనకు మాత్రం ఇచ్చే ఉద్దేశ్యంలో లేడంటే, తనపట్ల కుళ్ళుబుద్ధి వున్నదన్నమాట! అతడి బుద్ధి ఎలాంటిదో బయటపెట్టాలని, ఆయన అప్పటికప్పుడు ఊదలయ్య ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో ఊదలయ్య తక్కెడతో ఏదో తూస్తూ, "రండి సీతారామయ్యగారూ! ఊరగాయల పని ఉన్నప్పుడు తక్కెడను మరే తూకానికీ వాడం. అందుకే మీ అమ్మాయొస్తే లేదని చెప్పాను. ఏమీ అనుకోవద్దు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"ఇందులో అనుకోవడానికేముందికానీ, నువ్వు ఉపకారబుద్ధికి పేరుపడ్డవాడివికదా! నా ఇంటికి నిత్యం రోగులొస్తారని తెలిసినవాడివి. ఇంకొక తక్కెడ కొనివుంచాల్సింది. అప్పుడు నీ ఊరగాయలపనీ ఆగదు; నాకూ సౌకర్యంగా వుంటుంది," అన్నాడు సీతారామయ్య వెటకారంగా.

ఇందుకు ఊదలయ్య ఒక క్షణం ఆశ్చర్యపోయి, "అయ్యో!మీరు చెప్పక మునుపే ఆ పని చేశాను. మీరు మా ఇంటి ఎదుట దిగినప్పటినుంచీ, మా ఇంట్లో తక్కెడకు గిరాకీ పెరిగింది. మాకు తక్కెడ నిత్యావసరం. అలాగని మీకు కాదనలేను. అందుకని మరొక తక్కెడ కొని ఇంట్లో వుంచాను. ఆ తక్కెడనే, ఈ రోజు వాళ్ళింట్లో ఏదో పచారీ సరుకులు తూచాలని భీమయ్య తీసుకువెళ్ళాడు," అన్నాడు.

ఇది విని సీతారామయ్యకు తల తిరిగింది. వైద్యం చేసేది తను. వద్దన్నా అందుకుగాను తనకు ప్రతిఫలం ముడుతున్నది. అయితే, తనవైద్యానికి ఒక తక్కెడకూడా అవసరమనీ, అది తనే కొనాలనీ తనకు తోచలేదు. తన వైద్యంకోసం ఊదలయ్య తక్కెడకొన్నాడు! ఆ తక్కెడ ఇచ్చినందుకు, అతడికి ప్రతిఫలమేముంది? అందుకే ఊరివాళ్ళ పొగడ్తలు అతడికి దక్కాయి. ఊదలయ్య, తన కూతురుతో తక్కెడ లేదన్నాడంటే, అది నిజమేమరి! ఆ తక్కెడ ఇప్పుడు భీమయ్య ఇంట్లో వుంది.

సీతారామయ్య ఇలా ఆలోచించి ఊదలయ్యతో, "ఊదలయ్యా! ఉపకారబుద్ధి సహజంగా వుండాలి. కానీ కావాలని తెచ్చుకుంటే వచ్చేదికాదు. నువ్వు నిజంగా చాలా గొప్ప ఉపకారివి!" అని మనస్ఫూర్తిగా ఆయన్ని పొగిడి తిరిగి ఇంటికి వెళ్ళాడు.



# హాస్యచతురులు: తెనాలి రామలింగడు



తెనాలి రామలింగడు, శ్రీకృష్ణదేవరాయల అభిమానానికి పాత్రుడు కాకపూర్వం, రాజును కలుసుకోవడానికి చాలాసార్లు ప్రయత్నించాడు. అయితే, కాపలా భటులు ఆయన్ను లోపలికి వెళ్ళనిచ్చేవారు కాదు. పైగా ఆయన వేషభాషల గురించి దుర్భాషలాడేవారు.



ఒకనాడు, రాజు తన ముఖ్య అనుచరులతో కలిసి ఒక నాట్యప్రదర్శనను తిలకిస్తున్నాడు. అప్పుడు ఎవరినీ లోపలికి అనుమతించవద్దని రాజు కాపలాభటులను ఆజ్ఞాపించాడు. అయితే, అది తెలియని తెనాలి రామలింగడు, ఎప్పటిలాగే రాజదర్శనానికి వచ్చాడు. భవన ద్వారాన్ని సమీపించగానే కాపలాభటులాయనకు అడ్డుపడి, కిందపడేలా పట్టి తోశారు.



రామలింగడు వెంటనే లేచి నిలబడి దుమ్ము దులుపుకుంటూ, "భలే! మీరు మహాబలవంతులు. ఇంత దృఢమైన శరీరారుధ్యం, భుజబలం కలిగి ఉన్నందుకు తప్పక మిమ్మల్ని సన్మానించాలి!" అన్నాడు వ్యంగ్యంగా. "అవును, ఈ సన్మానాలూ, బహుమతులూ అన్నీ మీబోటి వారికే గాని, మమ్మల్ని అసలుపట్టించుకునేవారే లేరు," అన్నాడు కాపలాభటుల నాయకుడు విరక్తిగా.



"విచారించవద్దు. నన్ను లోపలికివెళ్ళనివ్వు. ఈరోజు నాకు రాజుగారు ఎలాంటిబహుమతి ఇచ్చినా, అందులో సగం నీకూ, మిగిలిన సగం నీ అనుచరుడికీ ఇచ్చేస్తాను," అన్నాడు రామలింగడు ముఖ్యకాపలాభటుడితో. అలాగేనని కాపలాభటులు పేరాశకొద్దీ, రామలింగణ్ణి నవ్వుతూ లోపలికి అనుమతించారు.



రామలింగడు సభలోకి ప్రవేశించి తిన్నగా వేదిక మీదికి వెళ్ళి, తల్లకిందులుగా నిలబడ్డాడు. నర్తకి కోపంతో, నాట్యం చేయడం నిలిపివేసింది. రాజు ఆగ్రహం పట్టలేక, "ఎవడా మూర్ఖుడు? వాణ్ణి దూరంగా లాక్కు వెళ్ళండి!" అన్నాడు.



రామలింగడు మామూలుగా తిరిగి కాళ్ళపై నిలబడి, "మహాప్రభూ! క్షమించాలి. ఈ నర్తకీమణి నాట్యానికి మెచ్చి కానుకలు ఇచ్చినట్టే, నాకూ ఏదైనా బహుమతి ఇప్పించండి," అన్నాడు. "బహుమతా! తప్పక ఇప్పిస్తాను," అంటూ రాజు భటులను పిలిచి, "వాడికి వంద కొరడా దెబ్బలు ఇవ్వండి!" అన్నాడు.



"కృతజ్ఞతలు మహాప్రభూ! తమరిచ్చే బహుమతిని తమ ప్రధాన కాపలాభటుడితోనూ, అతడి అనుచరుడితోనూ పంచుకుంటానని మాట ఇచ్చి మరీ లోపలికి వచ్చాను," అన్నాడు రామలింగడు. రాజు ఆశ్చర్యంగా చూశాడు. అప్పుడు రామలింగడు రాజదర్శనం కోసం పడిన పాట్లూ, లోపలికి రావటానికి కాపలా భటులతో కుదుర్చుకున్న ఒప్పందం గురించీ వివరించాడు.



రాజు ఇద్దరు కాపలా భటులనూ, పిలిపించి కొరడా దెబ్బలతో కఠినంగా శిక్షించాడు. ఆ తరవాత రాజసభలోకి ప్రవేశించాలంటే రామలింగడికి ఎలాంటి ఆటంకమూ ఉండేది కాదు. ఎవరూ ఆపేవారు కాదు.

# వేసవికాలం-చల్లని విశేషాలు

నిప్పులు చెరిగే ఎండవేడికి కొలనులోని బురదనీళ్ళు బాగా వేడెక్కిపోయాయి. ఆ కొలనులోని ఒక కప్ప ఆ వేడికి తట్టుకోలేక గట్టుమీదికి ఎగిరి దూకిచిన్న నీడలోకి చేరింది. ఆ నీడ-తాపంతో తపించిపోతూన్న ఒకపాము పడగనీడ!

నడినెత్తిమీదికి చేరిన సూర్యుడి వేడి కిరణాలకు తట్టుకోలేక మరొక పాము; అలిసిపోయి వున్న ఒక నెమలి సమీపంలో, రొప్పుతూ రోజుతూ స్పృహ కోల్పోయి నిద్ర పోయింది!

కాళిదాసు తన ఋతుసంహారకావ్యంలో గ్రీష్మఋతువును వర్ణిస్తూ, సృష్టించిన కొన్ని దృశ్యాలు ఇవి!



వేసవి అనగానే మనకు నిప్పులు చెరిగే ఎండలు, వడగాలులు, చెమటలు, నీరసాలు ఇవే జ్ఞాపకం వస్తాయి. అయినా, మండే ఎండలతోపాటు-ద్రాక్ష, నారింజ, ఖర్బూజా, మామిడి వంటిపళ్ళనూ; మల్లెలు, మొల్లలు వంటిపువ్వులనూ ప్రకృతి మనకు వేసవిలో ప్రసాదిస్తున్నది.

ఆధునిక కాలంలో ఎండవేడి తెలియకుండా ఎయిర్‌కండిషన్లూ, ఎయిర్‌కూలర్లూ, ఫ్యాన్లూ, ఐస్‌క్రీములూ, శీతలపానీయాలూ చాలావరకు కాపాడుతున్నాయి. అయితే, ఇవన్నీ లేని పూర్వకాలంలో కూడా ఎండదెబ్బ తగలకుండా గృహనిర్మాణంలోనే తగు జాగ్రత్తలు తీసుకునేవారు. గ్రామసీమలలోని మామూలు ప్రజానీకం ఇళ్ళు పూరిళ్లేగనక, లోపలికి గాలి బాగా ప్రవేశించేలా నిర్మించుకునేవారు. ఇక రాజభవనాల విషయానికి వస్తే ప్రత్యేక శ్రద్ధ కనబరచేవారు.

1672 ప్రాంతంలో మధ్యప్రదేశ్‌లోని ఓర్చాను మధుకర్‌షా పాలించేవాడు. ఆయన కాలంలోని రాయ్‌పర్వీన్ అనే ఒక సంపన్న కవయిత్రి భవనం గురించి చెప్పుకోవాలి. రకరకాల పుష్ప ఫల వృక్షాలూ, నీటిబుగ్గలూ నిండిన ఒక ఉద్యానవనం మధ్య నిర్మించిన రెండంతస్థుల భవనం అది. ఎత్తు తక్కువే కాని మొదటి అంతస్థు నేలమట్టానికి అడుగున ఉంది. వేడినంతా రెండవ అంతస్థు భరించడం వల్ల భూమి అడుగున భవనం చల్లగా ఉంటోంది. 'ఫూల్‌బాగ్' అనే ఈ

భవనం కింది అంతస్థుకు పైనున్న ఉద్యాన వనంలో వరుసలు వరుసలుగా నీటిబుగ్గలు అమర్చబడి ఉన్నాయి. ఇవి కింది అంతస్థు మీదికి నీటి తుంపర్లను చల్లుతూ ఉంటాయి!

రాజస్థాన్‌లో మేవార్‌కు చెందిన రాణా జగత్‌సింగ్ తెల్లటి చలవరాతిలో సుప్రసిద్ధ మైన సరోవర భవనాన్ని (లేక్ ప్యాలస్) నిర్మిం చాడు. ఇది ఒక సరస్సుమధ్య ఉండడంవల్ల ఈ భవనం ఎప్పుడూ చల్లగా ఉంటుంది!

వేసవి సెలవులను హాయిగా గడపడానికి మనదేశంలో సిమ్లా, డెహ్రాడూన్, ముసూరీ, రాణీకేట్, ఊటీ, డార్జిలింగ్, మహాబలేశ్వర్, నైని టాల్‌మొదలైనవేసవి విడుదులు ఉన్నాయి. వీటిలో చాలావాటిని బ్రిటిష్ పాలకులే ఏర్పా టుచేశారు. వాళ్ళు మన దేశంలో వేసవి వేడిని తట్టుకోలేక విలవిలలాడిపోయేవారు. కొంద రయితే ఎండాకాలం వ్యాధులకు ప్రాణాలు కూడా కోల్పోయారు. అందువల్ల వాళ్ళు చల్లగా ఉన్న కొండలమీద భవనాలు నిర్మించుకుని వేసవిలో అక్కడే గడిపేవాళ్ళు.

1850 వరకు మనదేశంలో ఐస్ తయారు చేసేవారు కాదు. బ్రిటిష్‌వాళ్ళు ఐస్ లేకుండా వేసవిని భరించలేకపోయేవారు. అందువల్ల అమెరికా నుంచి ఐస్‌గడ్డలను దిగుమతి చేసుకుని భద్రపరచేవారు. మద్రాసు మెరీనా బీచ్ సమీపం ట్రిప్లికేన్‌లో ఐస్‌ను భద్రపరచ డానికి 'ఐస్ హౌస్'ను నిర్మించారు.

మనదేశంలో రాజస్థాన్, గుజరాత్ ప్రాంతా లలో ఎండతాకిడి మరీ ఎక్కువ. 48-52 డిగ్రీల సెల్షియస్‌దాకా ఉష్ణోగ్రత ఉంటుంది. అందువల్లనే అక్కడ పురుషులు పెద్దపెద్ద తలపాగాలు చుట్టుకుంటారు.



గుజరాత్‌లో రాజులు, రాణులు వెళ్ళే రాజ మార్గాల పక్కన దాదాపు 100అడుగుల లోతు విశాలమైనమెట్లబావులు తవ్వేవారు. ప్రయా ణపు బడలిక తీర్చుకోవడానికి వీటిని ఉపయో గించేవారు.15 వశతాబ్దంలోవైరసింహవాఘేలా నిర్మించిన 'అడలాజ్‌వావ్' చాలా ప్రసిద్ధమైనది.

జోధ్‌పూర్, బ్రహ్మపూర్ ప్రాంతాలలో ఇళ్ళకు నీలం లేదా తెలుపురంగులతో వెల్ల వేస్తారు. ఈ రంగులు వేడినీ, వెలుగునూ పరావర్తనం చెందేలా చేస్తాయి గనక, ఇళ్ళ లోపల చల్లగా ఉంటుంది.

ఇటీవలికాలం వరకు అంటే ఫ్యాన్లు రాక ముందు మనవాళ్ళు తాటాకు విసన కర్రలు ఉపయోగించేవాళ్ళు. వీటిని అందంగా తయా రుచేసి, రంగులు అద్దడంలో మంచి నేర్పరులు. రాజులు ఏనుగు దంతాలు, గంధపు కొయ్యలతో చేసిన విసనకర్రలు వాడేవారు. విసన కర్రలను గంధపు జలంలో ముంచి వీచుకునేవారని కాళిదాసు తన కావ్యాలలో పేర్కొన్నాడు.

బ్రిటిష్ అధికారులు పంకాలనువాడేవారు. దీర్ఘచతురస్రాకారంలో ఉన్న బట్టలను పైకప్పుల నుంచి వేలాడతీసేవారు. పనివాళ్ళు ఒకతాటితో దానిని లాగుతూఉంటే, అకదలికకు గాలివీచేది!

ఎండదెబ్బ తగలకుండా ఉండడానికి మన పూర్వులు కొన్ని పద్ధతులు అనుసరించేవారు:

ఉదయం, సాయంకాలం ఇంటిచుట్టూ నీళ్ళు చల్లేవారు.

కిటికీలకు వెదురు తడికలు, కొన్ని సుగంధపువేళ్ళతో తెరలు అమర్చి, వాటిని తరచూ నీళ్ళతో తడిపేవాళ్ళు.

నీళ్ళు, పెరుగు, మజ్జిగ మొదలైనవాటిని కొత్తకుండలలో ఉంచడంవల్ల వాటిలోని సూక్ష్మ రంధ్రాల కారణంగా అవి చల్లగాఉండేవి.

కొందరు తలకు ఆముదం రాసుకునేవాళ్ళు; తలంటు స్నానం చేసేవాళ్ళు.

వేడి తగ్గడానికిగులాబీరేకులు,తేనె కలిపి తయారుచేసే గుల్కంద్ తినేవారు.

ఆహారంలో లేత కొబ్బరినీళ్ళు, నిమ్మరసం, దోసకాయలు, పళ్ళు ఎక్కువ తీసుకునేవారు. ఒంటికి చందనం పూసుకునేవారు.

ఇక ఆనాటి పానీయాల విషయానికి వస్తే–బెల్లం, నిమ్మరసం, సొంఠి, ఏలకుల పొడి కలిపి చేసే పానకం ఒంటికి చలవచేస్తుందని వేసవిలో తీసుకునేవారు.

ఉత్తరభారతంలో లస్సీలాగే దక్షిణాదిలో మజ్జిగ ప్రసిద్ధం.

గుజరాత్‌లో మామిడిపళ్ళతో చేసే భాష్లో, బెంగాల్‌లో బిల్వరసం, దేశమంతటా బెల్లం, నిమ్మరసం; బెల్లం, పెరుగు కలిపి చేసే గుర్‌కా షర్బత్ చాలా ప్రసిద్ధం!

ఇక వేసవిలో విరివిగా పండేవి మామిడి పళ్ళు. వీటిలో రసాలు, ఆల్ఫోన్స్, రత్నగిరి అంటూ చాలా రకాలున్నాయి. వీటితో పానీయాలూ, పచ్చళ్ళూ, ఊరగాయలూ తయారు చేస్తారు. 16వ శతాబ్దంలో మొగలులు వీటిలో చాలా కొత్తరకాలను అభివృద్ధిచేశారు. వాటిలో బంగనపల్లి మామిడిపళ్ళంటే ఇష్టంలేని వాళ్ళంటూ ఉండరు.

వేసవిలో అన్నిటికన్నా ముఖ్యం ఎండల్లో తిరగకుండా ఉండడం. పిల్లలకు వేసవి సెలవులు అయిపోయి, జూన్‌మొదటి వారంలో పాఠశాలలు తెరుస్తారు. సెలవులను హాయిగా గడిపి, బడులకు వెళ్ళడానికి సిద్ధంకావాలి.





# రాజైన దేవుడు!



ఒకప్పుడు రాజును దైవస్వ రూపుడిగా భావించేవారు. అయితే, దేవుణ్ణి రాజుగా కొలిచే ఆలయం ఒకటి మధ్య ప్రదేశ్‌లో ఉంది. ఇక్కడి ఓర్చా లోని 'రామరాజు' ఆలయాన్ని ఆ ప్రాంతాన్ని పాలించిన బుందేల వంశానికి చెందిన మధుకర్ షా అనే రాజు 1500 సం.లలో నిర్మించాడు. ఆయన శ్రీకృష్ణ భక్తుడు. ఆయన భార్య రాణీ గణేశాదేవికి మాత్రం, శ్రీరాముడంటే పరమ భక్తి.

ఒకసారి బృందావనానికి వెళ్ళాలనుకున్న రాజు, రాణీ గణేశాదేవిని తన వెంట రమ్మ న్నాడు. అయితే, అంతకు ముందే ఆమె రామజన్మస్థాన మైన అయోధ్యకు వెళ్ళాలను కుని ఉండడం వల్ల, రాజు వెంట రాలేనన్నది. రాజుకు కోపం వచ్చి, "అయితే, వచ్చే ప్పుడు అయోధ్య నుంచి శ్రీరాముణ్ణి వెంట తీసుకు రా, చూద్దాం!" అని భార్యను సవాలు చేశాడు.

రాణీ అలాగేనని అయో ధ్యకు వెళ్ళి అక్కడే ఒక సంవ త్సరకాలం భక్తితో గడిపింది.

శ్రీరాముడు ఒకనాడు ఆమె కలలో కనిపించి, "నన్ను దేవుడిగా కాకుండా రాజుగా ప్రతిష్ఠించే పక్షంలో నేను నీ వెంట రావడానికి సిద్ధం!" అన్నాడట. అలాగేనని ఆమె కనులు తెరిచి చూస్తే ఎదుట రాముడి విగ్రహం కనిపిం చిందట. ఆమె పరమానందం చెందింది.

రాముడి విగ్రహంతో వచ్చిన రాణీని చూడగానే, రాజు మధుకర్ షా తాను ఇచ్చిన మాట ప్రకారం శ్రీరాముడి విగ్రహానికి అందమైన గుడి కట్టించాడు.

మనదేశంలో శ్రీరాముణ్ణి రాజుగా కొలుస్తూన్న ఏకైక మందిరం ఓర్చా 'రామరాజు' ఆలయం!

## బీహార్ జానపద కథ

బీహార్ రాష్ట్రం మనదేశ ఉత్తర - ఈశాన్య భాగంలో ఉంది. బౌద్ధమఠాలను విహారాలు అని అంటారు. బౌద్ధవిహారాలు ఎక్కువగా ఉండడం వల్ల ఈ ప్రాంతానికి 'విహార' అనే పేరు ఏర్పడి అదే కాలక్రమంలో బీహార్ అయింది. కొన్ని శతాబ్దాలకు పూర్వం బీహార్ బౌద్ధమతానికి ప్రధానకేంద్రంగా ఉండేది. బౌద్ధమత సంస్థాపకుడైన గౌతమబుద్ధుడు, ఇక్కడి లుంబినీ వనంలో జన్మించాడు. బుద్ధగయలో జ్ఞానం పొందాడు. అక్కడే నిర్వాణం కూడా పొందాడు.

అశోక చక్రవర్తి రాజధానీనగరం పాటలీ పుత్రం కూడా మరొక ప్రధాన మత, విద్యా కేంద్రం. అదే ఈనాటి బీహార్ రాజధాని పాట్నా. 94,16,300 చ.కి.మీ వైశాల్యం కలిగిన బీహార్ మనదేశంలో తొమ్మిదవ పెద్దరాష్ట్రం. 8,28,78,796 జనాభా కలిగిన బీహార్ జనాభాలో రెండవ స్థానంలో వుంది. ఉత్తర దిశలో నేపాల్, పశ్చిమంలో ఉత్తరప్రదేశ్, తూర్పుదిశలో పశ్చిమ బెంగాల్, దక్షిణంలో నూతన రాష్ట్రం జార్ఖండ్ సరిహద్దులుగా కలిగివుంది. బీహార్‌లో అధికార భాష హిందీ. హిందీలో చాలా మాండలికాలు మాట్లాడే ప్రజలు ఇక్కడ ఉన్నారు. వాటిలో భోజ్‌పురి, మైథిలి అనేవి చాలా ముఖ్యమైనవి.

# మల్లుడు-మందమతి దయ్యం!

సీతాపూర్ అనే గ్రామంలో బలవంతుడూ, తెలివైన వాడూ అయిన బల్వాన్ అనే ఒక మల్లుడు ఉండే వాడు. ఆ చుట్టుపక్కల ప్రాంతాలలో వాణ్ణి ఓడించేవారు లేకపోయారు. దాంతో వాడు తనను గురించి గొప్పలు చెప్పుకోవడం ప్రారంభించాడు.

ఒకనాడు గ్రామస్థులు కొందరు సంత సమీపంలోని రచ్చబండవద్ద చేరి పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. ఆ మాటలమధ్య భయం గురించి ప్రస్తావన వచ్చింది. అప్పుడు అక్కడే వున్న బల్వాన్, "నాకు ఏదన్నా భయంలేదు. రాక్ష



సులన్నా, దయ్యాలన్నా కూడా లెక్క చేయను,'' అన్నాడు మీసాలు మెలేస్తూ.

''దయ్యాలన్నా భయం లేదా? పాణిగంజ్ లోయలో తచ్చాడుతున్న దయ్యాలన్నా లెక్కచేయవా?'' అని అడిగాడు ఒకడు.

''ఎక్కడుంది ఆ పాణిగంజ్‌లోయ? దాన్ని గురించి ఎప్పుడో వినడం తప్ప అక్కడికి వెళ్ళే దారికూడా తెలియదు నాకు. తెలిస్తేనా వెళ్ళి ఆ దయ్యాల్ని ఒక ఆట ఆడించేవాణ్ణి!'' అన్నాడు బల్వాన్ నవ్వుతూ.

అప్పుడు గుంపులో వున్న ఒక ముసలాయన ముందుకువచ్చి, ''తన్పూర్, రాంపూర్‌పట్టణాల మధ్య ఉన్నదే పాణిగంజ్ లోయ. అయితే, అక్కడికి వెళ్ళే మార్గం మాత్రం చాలా భయంకరమైనది. రాళ్ళూ రప్పలూ, ముళ్ళ పొదలూ, బండలూ, సొరంగాలూ దాటుకుని వెళ్ళాలి. ఆ ఇరుకు మార్గానికి ఇరువైపులా ఉన్న కొండ శిఖరాల మీది బండలు ఏ క్షణాన్నయినా బాటసారులపైన విరుచుకుపడేలా ఉంటాయి,'' అన్నాడు.

''ముళ్ళ మార్గాలూ, బండలూ నాకేం సమస్యలు కావు. వాటిని సులభంగా దాటుకుని వెళ్ళగలను,'' అన్నాడు మల్లుడు.

''నువ్వు కథ సాంతం వినలేదు. ఆ లోయలో అసలు ప్రమాదం దయ్యాలనుంచే. అందుకే దానిని దయ్యాల లోయ అని కూడా అంటారు. అక్కడి దయ్యాలు చాలా భయంకరమైనవి. మానవరక్తం, నరమాంసం కోసం ఎంతటి ఘోరానికైనా వెనుకాడవు. బాటసారులను చంపి తింటాయి. వాళ్ళదగ్గరున్న నగలనూ, ధనాన్నీ తీసుకెళ్ళి గుహల్లో దాచిపెడతాయి,'' అన్నాడు పక్కనే నిలబడ్డ ఒక పూలవ్యాపారి.

''అంతేకాదు, ఈ దయ్యాలు తమకు ఇష్టమైన రూపాలను క్షణంలో దాల్చగలవు. అందువల్ల



వచ్చింది దయ్యమా? మనిషా అని ఊహించడం కూడా సాధ్యం కాదు,'' అన్నాడు కుండలమ్మేవాడు.

''ఛీఛీ ఇవన్నీ గోరంతల్ని, కొండంతలు చేసే వదంతులు. నేను ఆ లోయకు తప్పకుండా వెళతాను. కనిపించిన దయ్యంతో కుస్తీపట్టి దాని పీచమణుస్తాను. అంతేకాదు; నేను చూసే తొలి దయ్యాన్ని తెలివిగా మోసపుచ్చకపోతే నా పేరు వీరమల్లు బల్వాన్ కాదు,'' అంటూ తొడగొట్టి మరీ శపథం చేశాడు మల్లుడు.

మరునాడే బల్వాన్ లోయకేసి బయలుదేరాడు. వాడికి పొరుగింట్లో వున్న ముసలవ్వ వచ్చి ''బిడ్డా!'' అంటూ ఆప్యాయంగా నొసట కుంకుమ బొట్టుపెట్టి, ''నిన్ను దేవుడు కాపాడుతాడు. ఇదిగో ఈ కోడిగుడ్డునూ, ఉప్పు పొట్లాన్నీ భద్రంగా తీసుకెళ్ళు. ఆపత్సమయంలో వీటిని తెలివిగా ఉపయోగించుకోవచ్చు,'' అంటూ రెంటినీ అతడికిచ్చింది. మల్లుడు లోయకేసి పయనమయ్యాడు.

కొన్నాళ్ళ ప్రయాణం తరవాత అతడు లోయను చేరుకున్నాడు. ''బల్వాన్! నిన్ను ఇక్కడ కలుసు

కోవడం చాలా సంతోషంగా ఉంది. నేను నీమిత్రుడు గబ్బర్‌ని. రా, ఇలా రా. మనం కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం!'' అనే పిలుపు వినిపించింది.

ఆ పిలిచేది దయ్యమే అని బల్వాన్‌వెంటనే గ్రహించాడు. ''గబ్బర్! మిత్రమా! నువ్వు ఇప్పు డెక్కడున్నావు? కంటికి కనిపించడం లేదే!'' అన్నాడు మల్లుడు బిగ్గరగా.

మరుక్షణమే ఒకబండచాటునుంచి దయ్యం గబ్బర్ రూపంలో మల్లుడి ఎదుటికి నవ్వుతూ వచ్చింది.

''ఆహా, నువ్విక్కడున్నావా? నా మిత్రుడి రూపంలో వచ్చి నన్ను మోసగించాలని చూస్తున్న దయ్యం కదా నువ్వు. నీ ఆటలు నా దగ్గర సాగవు. అసలునేనింతదూరుఎందుకువచ్చానో తెలుసా?'' అని అడిగాడు మల్లుడు గంభీరంగా.

దయ్యానికి ఆశ్చర్యం కలిగింది. అంతవరకూ ఏ నరమానవుడు కూడా తననిలా నిర్లక్ష్యంతో ప్రశ్నించలేదు. ''నువ్వు ఎందుకిలా వచ్చావో, నాకెలా తెలుసు?'' అన్నది దయ్యం.

''ఓహో! అంటే నువ్వు మందమతి దయ్యాని వన్నమాట. అందుకే మనిషి మనసును తెలుసుకోలేకుండా ఉన్నావు. చూడు! నేను మల్ల యుద్ధంలో మహావీరుణ్ణి. జంతువులను పట్టి మింగే మొసళ్ళనూ, మనుషులను చంపే సింహాలనూ నా ముష్టిఘాతంతో హతమార్చాను. ఇప్పుడు కొన్ని దయ్యాలను చంపడానికి ఇక్కడికి వచ్చాను,'' అన్నాడు మల్లుడు.

దయ్యం అతన్ని కిందికీ మీదికీ పరిశీలనగా చూస్తూ, ''అయినా చూడ్డానికి నువ్వంత బలవంతుడిలా కనిపించడం లేదే!'' అన్నది అనుమానంగా.

''రూపాన్ని చూసి మోసపోవద్దు. ఇప్పుడు నిన్నే చూడు. చూడ్డానికి గబ్బర్‌లా ఉన్నావు. అయితే, నువ్వు గబ్బర్‌వి కావు కదా?'' అని మల్లుడు కొంతసేపు ఆగి, కిందికి వంగి నేలపై నుంచి ఒక రాయిని తీసి చూపుతూ, ''ఇది పొడిగా కనిపిస్తున్నది. అవునా! అయితే దీనిని పిండావంటే ద్రవం కారుతుంది, పిండు మరి,''

## నలంద విశ్వవిద్యాలయం

నలంద విశ్వవిద్యాలయం క్రీ.పూ 5వ శతాబ్దంలో గుప్తరాజుల చేత స్థాపించబడింది. అదొక ముఖ్యమైన విద్యాకేంద్రంగా అభివృద్ధిగాంచింది. ఇక్కడ బౌద్ధమతానికి (మహాయాన, హీనయాన శాఖలకు) సంబంధించిన గ్రంథాలు, వేదాలు, హేతువిద్య అనే తర్కం, 'శబ్దవిద్య' అనే వ్యాకరణం, చికిత్సావిద్య (వైద్యం) మొదలైన వాటిని బోధించేవారు.

ఈ విశ్వవిద్యాలయంలో వేలాదిమంది విద్యార్థులు, అధ్యాపకులు ఉండేవారు. దేశవిదేశాలనుంచికూడావిద్యార్థులువచ్చేవారు. వారిలో చీనా బౌద్ధయాత్రికుడు హుయాన్‌త్సాంగ్ సుప్రసిద్ధుడు. ఈ విశ్వవిద్యాలయాన్ని హర్షవర్ధనుడు, పాలవంశస్థులు కూడా పోషించారు.



అంటూ దానిని దయ్యం చేతికిచ్చాడు.

దయ్యం రాయిని తీసుకుని గట్టిగా పిండింది. అయినా చుక్క ద్రవం రాలేదు. నాలుగైదుసార్లు పిండి చూసి, ''అసాధ్యం!'' అంటూ రాయిని బల్వాన్ చేతికిచ్చేసింది.

బల్వాన్ దయ్యం కంటపడకుండా రాయిని దాచేసి, జేబులోవున్న కోడిగుడ్డును పిడికిలిలో పట్టుకుని, ''ఇప్పుడు చూడు. ఈ రాయిని పిండుతాను. అందులో నుంచి నూనె కారుతుంది,'' అన్నాడు.

బల్వాన్ పిండగానే, గుడ్డు పచ్చసొన, తెల్లసొన కలిసినట్టు వేళ్ళ సందుల నుంచి ద్రవం కారింది.

దయ్యం గుడ్లప్పగించి ఆ వింతను చూస్తూ ఉండిపోయిందే తప్ప, అదే సమయంలో బల్వాన్ మరో చేత్తో జేబునుంచి కొంత ఉప్పును తీసుకోవడం గమనించలేదు.

ఆ తరవాత బల్వాన్ నేలపై నుంచి ఒక పెద్ద గులకరాయిని తీసి దయ్యానికి చూపుతూ, ''ఈ గులకరాయిని నలిపి, ఉప్పుగా మార్చగలవా?'' అని అడిగాడు.

''నావల్ల కాదు,'' అన్నది దయ్యం.

''ఛీ,ఛీ నీలాంటి చేతగానివాణ్ణి సమఉజ్జీగా భావించి, నీతో కుస్తీ పట్టాలనుకున్నాను,'' అంటూ బల్వాన్ రెండు అరచేతులనూ ఒకటిగా కలిపి, రాయిని బలంగా నలుపుతున్నట్టు నటిస్తూ, ఒడుపుగా రాయిని వదిలేసి, అరచేతిలోని ఉప్పును దయ్యానికి చూపి, ''దీనిని రుచిచూడు. ఉప్పు కాదా ఇది?'' అని గద్దించాడు.

దయ్యం దానిని రుచిచూసి,వీడు మామూలు మనిషి కాడు అనే నిర్ణయానికి వచ్చింది.

బల్వాన్ కొన్ని క్షణాలు ఆగి, ''నిన్ను మా గ్రామానికి తీసుకువెళ్ళాలనుకుంటున్నాను. మా ఊళ్ళో దయ్యాన్ని చూసినవాళ్ళెవరూ లేరు. రేపు నాతో వస్తావా?'' అని అడిగాడు.

దయ్యం వెంటనే సమాధానం చెప్పకుండా, వీణ్ణి రాత్రికి నా గుహకు తీసుకుపోయి, నిద్ర



పోయేప్పుడు తలమీద బండరాయి వేసి, చంపేస్తాను, అని మనసులో పథకం వేసి, ''అదెంత భాగ్యం. నేనే కాదు, ఇంకా కొన్ని దయ్యాలు కూడా నీతో వస్తాయి. ఈ రాత్రికి నా గుహలోనే గడుపు. రేపు తెల్లవారగానే దయ్యాలతో కలిసి బయలుదేరుదాం. దయచేసి ఒక పూట నా ఆతిథ్యం స్వీకరించు'' అని వేడుకున్నది.

బల్వాన్ సరేనని తలాడించి, ''ఈలోగా నన్ను మోసగించాలని పిచ్చిపిచ్చిగా ఆలోచించావో, ఫలితం అనుభవిస్తావు. గులకరాయిలో ఉన్న ఉప్పును చూడగల నాకు, నీ మనసులో కదిలే దురాలోచనలను తెలుసుకోవడం కష్టం కాదన్న సంగతి మరిచిపోవద్దు!'' అని హెచ్చరించాడు.

దయ్యం బుద్ధిగా మసలుకుంటానని మాట ఇచ్చి, బల్వాన్‌ను తన గుహలోకి తీసుకువెళ్ళింది. చాలా గదులున్న సొరంగం లాంటి గుహనిండా బాటసారుల నుంచి దొంగిలించిన నగలు కనిపించాయి. మనుషుల పుర్రెలు, ఎముకలు కూడా బల్వాన్‌కు కనిపించాయి. అవి దయ్యం తిని వదిలేసిన మానవ కళేబరాల అవశేషాలని బల్వాన్ గ్రహించాడు.

## హస్తకళలు

బీహార్ హస్తకళలకు ప్రసిద్ధిగాంచింది. కళానైపుణ్యం ఉట్టిపడే వస్తువులు తయారుచేయడానికి రాళ్ళు, కొయ్యచెక్కలు, తోళ్ళు, లోహాలు, బట్టలు, లక్క, అద్దం మొదలైన వివిధవస్తుసామగ్రిని ఉపయోగిస్తారు.

ముఖ్యంగా 'మధుబని' అనే జానపద చిత్రలేఖనానికి బీహార్ ప్రసిద్ధిగాంచింది. సంప్రదాయానుగతంగా వస్తున్న ఈ చిత్రలేఖనాన్ని స్త్రీలు నేర్చుకుంటారు. గోడల మీద, వాకిళ్ళలో వేస్తారు. మతానికి సంబంధించిన దృశ్యాలు గల ఈ చిత్రాలను - మొక్కలు, రాళ్ళ నుంచి తయారుచేసే రంగులను ఉపయోగించి చిత్రీకరిస్తారు.



దయ్యం క్షణాలలో భోజనం తయారు చేస్తానన్నది. అయితే బల్వాన్, "నేను రోజుకు ఒక్కపూట మాత్రమే భోజనం చేస్తాను. ఈ రోజుకు బయలుదేరే ముందు తిని వచ్చాను. అయినా, నీ తృప్తికోసం పిడికెడు అన్నం మాత్రం తింటాను," అన్నాడు.

"అలాగే. అన్నం వండాలంటే నిప్పు కావాలి కదా. నేను వెళ్ళి వంటచెరకు తెస్తాను. నువ్వు ఆ పీపా తీసుకుని దాపులనున్న చెలమ నుంచి నీళ్ళు తెచ్చుకో," అని ఒక మూలనున్న పీపాను చూపించి, అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

బల్వాన్ వెళ్ళి ఆ పీపాను తీసుకోబోయాడు. అయితే, అతడు దానిని కదిలించలేకపోయాడు. పశువుల కొమ్ములతో తయారుచేయబడి ఆ పీపా ఎంతో బరువుగా ఉంది. "ఇది ఖాళీగా ఉన్నప్పుడే మోయలేనంత బరువుగా వుందే! నీళ్ళతో నింపి మోసుకురాగలనా? నీళ్ళు తీసుకురావడానికి వేరొకమార్గం చూడాలి!" అని బల్వాన్ ఆలోచించసాగాడు.

చెలమ నుంచి గుహవరకు సొరంగం తవ్వాలని నిర్ణయించి, ఆ పనిలో నిమగ్నమయ్యాడు. తలపై కట్టెల మోపుతో వచ్చిన దయ్యం ఆ దృశ్యాన్ని చూడగానే, "ఏం చేస్తున్నావ్? నీళ్ళు తెమ్మని చెప్పి వెళ్ళాను కదా?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"అనుకుంటే, వంద పీపాల్లో నీళ్ళు తీసుకురాగలను. అదేం పెద్దపనికాదు. అయినా, నువ్వు నాకెంతో ఆప్యాయంగా ఆతిథ్యం ఇస్తున్నావు కదా? అందుకు ప్రతిగా నీకు శాశ్వతంగా గుర్తుండేలా ఒక కానుక ఇవ్వాలనుకుంటున్నాను. అందుకే నీటిచెలమ నుంచి గుహవరకు సొరంగం తవ్వుతున్నాను," అన్నాడు బల్వాన్.

ఈ రాత్రంతా వీడు సొరంగం తవ్వుతూ కూర్చుంటే వీణ్ణి చంపాలన్న తన పథకం ఏం కావాలి అని ఆలోచిస్తూ, "చాలా సంతోషం! తవ్వినంతవరకు చాలు. మిగిలిన పని నేను చూసుకుంటాను. నువ్వు భోజనంచేసిహాయిగా నిద్రపో!" అన్నది దయ్యం.

దయ్యం ఇలా అనడం వెనక ఏదో దురుద్దేశం ఉందని బల్వాన్ అనుమానించాడు.

తరవాత భోజనం చేసి బల్వాన్ నిద్రకు ఉపక్రమించాడు. దయ్యం వెంటనే నిద్రపోయింది. బల్వాన్ కీడు శంకించి, లేచి తను పడుకున్న మంచం మీద పెద్ద దిండును ఉంచి, దుప్పటితో కప్పాడు. ఆ తరవాత అతడు మంచం కింద చాటుగా పడుకున్నాడు.

మూడో జామున దయ్యం నిద్రలేచి, తిన్నగా మంచం దగ్గరికి వెళ్ళి పక్కనున్న ఆయుధంతో బలంగా దిండు మీద ఒక దెబ్బ కొట్టింది. మూలుగు కూడా వినిపించలేదు. మల్లుణ్ణి నిద్రలేవకుండా చంపాలన్న ఉద్దేశంతో మరొక ఆరుసార్లు బలంగా కొట్టింది. ఆ తరవాత తృప్తిగా తలాడించి వచ్చి తన పడక మీద పడుకున్నది.

మంచం కింద వున్న బల్వాన్, వెంటనే లేచి మంచం మీద పడుకుని, "మిత్రమా! నీ ఇంట్లో నల్లులు విపరీతంగా ఉన్నట్టున్నాయి. ఒక్క నిమిషంలో నన్ను ఏడుసార్లు కుట్టాయి!" అన్నాడు.

దయ్యం అదిరిపడింది. చచ్చాడని తాను అనుకున్న ఆ పల్లెటూరివాడు ప్రాణాలతో లేచి మాట్లాడుతున్నాడు. పైగా, తన బలమైన దెబ్బలను నల్లి కుట్టినట్టు చెబుతున్నాడు. మానవులు ఇలా తయారైతే, ఇక దయ్యాల గతి ఏమవుతుంది?" అని భయంతో కేకలు పెడుతూ గుహ నుంచి బయటపడి తిరిగి చూడకుండా ఎటో పారిపోయింది.



తెల్లవారాక బల్వాన్ తన గ్రామానికి తిరిగి వచ్చి కొన్ని బాడుగ బళ్ళను తీసుకుపోయి, గుహలోని నగలనూ, ధనాన్నీ ఇంటికి తరలించాడు. అందులో కొంత, తను ప్రయాణం కావడానికిముందు తన ఇంట ఉన్న కోడిగుడ్డూ, ఉప్పూ ఇచ్చి ఆశీర్వదించిన అవ్వకు ఇచ్చాడు.

బల్వాన్ ధైర్యంతో, తెలివితేటలతో గొప్ప ధనికుడయ్యాడు. తాను చూసిన దయ్యం గురించి మిత్రులకు చెప్పేవాడేగాని, లేనిపోని గొప్పలు మాత్రం చెప్పుకునేవాడు కాదు. మందమతి అయిన దయ్యాన్ని తనకు తారసపడేలా చేసిన దేవుణ్ణి కృతజ్ఞతతో తలుచుకునేవాడు.

## పర్యాటక ప్రదేశాలు

గౌతముబుద్ధుడు జ్ఞానం పొందిన పవిత్ర స్థలం బుద్ధగయ. బుద్ధుడు ఒక రావి చెట్టు కింద కూర్చుని తపస్సుచేసి జ్ఞానం పొందాడు. దానిని బోధివృక్షం అంటారు. బుద్ధగయలోని బౌద్ధ దేవాలయం, పురాతత్వ వస్తుప్రదర్శనశాల దర్శించతగినవి.

మరొక ముఖ్యమైన పర్యాటక ప్రదేశం రాజ్‌గిరి. ప్రకృతి సౌందర్యం నిండినకొండలు, అడవుల మధ్య ఉన్న సుందర ప్రదేశం ఇది. బుద్ధుడు జ్ఞానం పొందిన తరవాత ఇక్కడ ఐదేళ్ళు గడిపాడు. రాజ్‌గిరి చుట్టూ ఉన్న కొండలమీద 24 మంది తీర్థంకరులు తపస్సు చేయడం వల్ల దీనిని జైనులు కూడా పవిత్రంగా భావిస్తారు.

# చందమామ కబుర్లు

## అద్దం పరిష్కారం!

లక్నో జంతు ప్రదర్శనశాలలో సన్నీ, చినా అనే రెండు చింపాంజీలు ఉన్నాయి. వాటిని విడివిడి గదులలో ఉంచడం వల్ల ఒంటరి తనం కారణంగా అవి విచారంగా కనిపించ సాగాయి. ప్రదర్శనశాలను చూడడానికి వచ్చేవారికేసి చూడడం కూడా మానివేశాయి. ఏం చేయడమా అని ప్రదర్శనశాల నిర్వాహ కులు బుర్రలు గోక్కోసాగారు. ఆఖరికి ఒక ప్రయోగం చేయడానికి నిర్ణయించి, రాత్రికి రాత్రే చింపాంజీ గదులలో నిలువెత్తు అద్దా లను అమర్చారు. చింపాంజీలు నిద్రలేచి చూడగానే అద్దాలలో – తాము తల గోక్కుంటే, తల గోక్కుని, నవ్వితే నవ్వి, గెంతితే గెంతి,



ఎడమకాలెత్తితే, కుడికాలెత్తే తమ ప్రతిబిం బాలను చూసి సంతోషించాయి. ఆశ్చర్యంచెం దాయి. వాటివిచారం మటుమాయమయింది. తమను చూడడానికి వచ్చే ప్రేక్షకులను చూసి, నవ్వడం గెంతటం ప్రారంభించాయి.

## వినోదమా? విషాదమా?



బ్రిటిష్ కొలంబియా కెలోనాకు చెందిన కూప్స్ కుటుంబీకులు 'బోజ్' అనేకొండచిలువ జాతి(పైథాన్)పామును పెంచుతున్నారు. 5మీ. (16.5 అడుగుల) పొడవున్న ఈ పామును గత ఐదేళ్ళుగా వాళ్ళు పెంచుతున్నారు. వాళ్ళింట్లో తొమ్మిదిమంది పిల్లలున్నారు. అయితే అక్కడి శిశుసంక్షేమశాఖ వాళ్ళు, ఇది పిల్లలకు అపాయ కరమని హెచ్చరిస్తున్నారు. ఒకటి పామును దూరంగా తీసుకెళ్ళాలి, లేదా పిల్లలను మరో చోటికి పంపేయాలని చెబుతున్నారు. అయితే కూప్స్ సీనియర్ తన పైథాన్ చాలా స్నేహపూర్వ కంగా మసలుకుంటుందనీ, బడిపిల్లలు సైతం దానిదగ్గరికి భయం లేకుండా వెళ్ళి ఆడుకుం టారనీ వాదిస్తున్నాడు.



# విఘ్నేశ్వరుడు

పార్వతి క్షణంలో తన దుఃఖమంతా మరిచి పోయి, పిల్లవాణ్ణి ఎత్తుకుని దిష్టి తీసింది. శివుడు చేతులు చాచి పిలిచాడు. మళ్ళీ ఏం చేసిపోతాడో అని భయం భయంగా తప్పట డుగులువేస్తూ వెళ్ళిన విఘ్నేశ్వరుడి ముద్దు చేష్టకు అంతా ముచ్చటపడ్డారు.

"నాయనా, విఘ్నేశ్వరా! నిన్ను పుత్రు డిగా పొంది ధన్యులం అయ్యాం. చిరంజీవ!" అని శివుడు ఎత్తి ముద్దాడుతూంటే విఘ్నే శ్వరుడు కిందకు దూకి, "తండ్రీ! ఎంతమాట, నేను మీ కొడుకును, ధన్యుణ్ణి నేను!" అంటూ పార్వతీ శివుల పాదాలను చిరుతొండంతో చుట్టి, కళ్ళకద్దుకొని ప్రణామాలు చేశాడు. తరవాత బుల్లిబుల్లి అడుగులతో వెళ్ళి, విష్ణువును సమీపించి ఆయనకు ప్రణామం చేశాడు.

విష్ణువు, "రావోయి ముద్దుల మేనల్లుడా!" అని దగ్గరకు తీసుకొని, "కళ్యాణమస్తు!" అని దీవించాడు.

అప్పుడు విష్ణువు కాంతిలో విఘ్నేశ్వరుడు నీలాకాశం రంగులో కనిపించాడు. విష్ణువుకూ, విఘ్నేశ్వరుడికీ ఏవో పోలికలున్నట్లు అంద రికీ తోచింది. అదే మేనమామ పోలిక అంటే! అని అనుకున్నారు.

వినాయకుడు బ్రహ్మకునమస్కరించాడు. బ్రహ్మ, "తొలిపూజలందుకోవయ్యా బొజ్జ గణపయ్యా!" అని అంటూ అతని ఏనుగు బుగ్గలు చిదిమి చిటిక వేశాడు.

తర్వాత విఘ్నేశ్వరుడు లక్ష్మికి, సరస్వతికి మ్రొక్కాడు. వాళ్ళిద్దరూ కలిసి అతణ్ణి ఎత్తు కుని చెరో చెంపా ముద్దాడి, "మేము విఘ్నే



శ్వరుడి ఇరుపక్కలా అత్తాకోడళ్ళ పొరపొచ్చాలు మాని ఇలాగే సఖ్యంగా ఉంటాము!" అని పార్వతిని చూసి, "ముగ్గురమూ ఒకే ముగ్గురమ్మల మూలపుటమ్మనుంచి వచ్చిన సంగతి పుత్రగణపతి చెప్పనే చెప్పాడు. తర్వాత మళ్ళా విడివిడిగా క్షీరసాగరం నుంచి లక్ష్మి, బ్రహ్మ నాలుక నుంచి సరస్వతిగా వాణి, మొదట దక్షుని కుమార్తె సతీదేవిగాను, ఇప్పుడు హిమవంతుని పుత్రి పార్వతిగా ఉమ అవతరించాము. జయలక్ష్మి అనే సిద్ధి, విద్యావతి అనే బుద్ధి వినాయకుడికి తగిన వధువులు. ఇహ విఘ్నేశ్వరుని పెళ్ళి ముచ్చటే చూడాలి!" అని అన్నారు.

లక్ష్మి, "లక్ష్మీకరుడైన విఘ్నేశ్వరుణ్ణి నమ్మిన వారిని స్థిరంగా అంటిపెట్టుకొని ఉంటాను! సిద్ధిస్వరూపిణి జయలక్ష్మి నా అంశ. వినాయకుడికి కానున్న భార్య!" అని చెప్పింది.

సరస్వతి, "విఘ్నేశ్వరుడు జ్ఞానప్రదాత, విజ్ఞానదాయకుడు. అక్షరాభ్యాసానికి ముందు పిల్లలచేత పసుపు ముద్ద విఘ్నేశుడి పూజ జరిపించి, విఘ్నేశ్వర పరిపూర్ణ స్వరూపంగా గుండ్రంగా చుట్టించి మరీ ఓనమాలు దిద్దించాలి; నా అంశగల విద్యావతి బుద్ధి రూపిణి, వినాయకుడి నాయకి!" అని చెప్పింది.

అప్పుడు విఘ్నేశ్వరుడు బేలముఖం పెట్టి, అందరినీ కలయజూచి, "చూశారా! పెద్దల తీరు ఎలా ఉందో! పెళ్ళిచేసుకొని, వారు పడ్డ అవస్థలే పిల్లలు కూడా పడాలని పెళ్ళి తొందర పెడతారేగాని, కొంతసేపు హాయిగా ఉండనివ్వరు. అందునా అమ్మలకు మరీ ఆరాటం!" అన్నాడు.

అప్పుడు విష్ణుమూర్తి, "లేదురా బాబూ! అణిమాది సిద్ధులకు, అష్టైశ్వర్యాలకు మూలమైనసిద్ధులు ఎనమండుగురు, చక్కనిచుక్కలై నిన్నుపూర్ణచంద్రుణ్ణి కొలిచినట్లు సేవిస్తూంటే చూడాలని తొందరగానే ఉంది, సుమీ!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "ఓహో! అలాగా, నువ్వు కృష్ణావతారంలో అష్టమహిషులతో వేగుతూ ఆనందిద్దువుగానిలే!" అన్నాడు.

విష్ణువు మందహాసం చేసి, "నీమాటకు తిరుగులేదు గాని, నీకుమాత్రం పదిమంది వధువుల పెళ్ళి తప్పదు!" అన్నాడు.

"అలాగైతే విఘ్నేశ్వరుడి పెళ్ళికి వెయ్యి విఘ్నాలు అన్న సామెతగా, నేనే విఘ్నాలు కల్పించుకోకతప్పదు!" అన్నాడు విఘ్నేశ్వరుడు చిరుకోపంతో.

"వెయ్యికాదు, కోటి విఘ్నాలు వచ్చినా విఘ్నేశ్వరుడి పెళ్ళి ఆగదు!" అని బ్రహ్మతో

గొంతులు కలిపి అందరూ ఒక్కసారిగా అన్నారు.

అప్పుడు నారదుడు ముందుకు వచ్చి, "విఘ్నేశ్వరా! వాచాలతలో నన్ను మించావు కాని, పెళ్ళి తప్పించుకోవడం ఎవరితరం! నేను సంసార సాగరం ఈదడం చాతగాకనే కదా మునినై తిరుగుతున్నాను. జ్ఞానేశ్వరా! కళ్యాణం, ఉద్యోగం పురుషలక్షణం అని పురుషోత్తములూ, ఆదిదేవుళ్ళూ అనిపించు కున్న ప్రముఖులంతా పెళ్ళిళ్ళు చేసుకొని సృష్టి, స్థితి, లయాది ఉద్యోగాలు హాయిగా చేస్తున్నారు. నీవూ, నేనూ అనగా ఎంత!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, "ఓహో! నీకూ పెళ్ళి పిచ్చి తగిలేలాగుందే! స్వయంవరానికి కూడా వెళ్ళేవులాగుంది!" అన్నాడు.

నారదుడు, "త్రికాలవేదిని నేనేననుకుంటే అనంతకాలవేదివి నీవు. నీతో వాదించటం నా తరమా? మాటకారితనంలో నీ తర్వాతనే నేను. అందరి జాతకాలూ నీ చేతుల్లోనే ఉన్నాయి. నిన్ను విస్మరించిన ఎలాంటి ఉద్దండ జ్యోతిష పాండిత్యమూ ఫలించదు. మనం ఇద్దరం మేలురకం వాగుడుకాయలం! మాటలకు దిగితే అనంత కాలం చాలదుగాని, నీవు పూర్ణ జ్ఞానివి. మాలాంటి అర్థజ్ఞానులు ఎలాంటి పిచ్చిలోపడ్డా నీలాంటివాళ్ళు తామరాకు మీద నీటిబొట్టులాగ దేనికీ లొంగిపోరు.నీవు మాయకు అతీతుడివి.కాబట్టిసిద్ధిబుద్ధులూ, అష్టసిద్ధులూ నిన్ను వరించుతాయని, నన్ను కూడా శ్రీరస్తు, శుభమస్తు, శీఘ్రకళ్యాణ సిద్ధి రస్తు! అని పలికించనియ్యి," అని అంటూ మహతి వీణపై కళ్యాణిరాగం మొదలుపెట్టి



సామరాగం అందుకొని సౌరాష్ట్ర రాగంతో మంగళ గీతాన్ని పలికించాడు.

దేవతలంతా ఎవరి తావులకువారు వెళ్ళారు. విఘ్నేశ్వరుణ్ణీ, పార్వతినీ, వెంట బెట్టుకుని శివుడు తన నివాసమైన కైలాసానికి వెళ్ళాడు. నారదుడు తిన్నగా వజ్రదంతుడి దగ్గరికి బయలుదేరాడు.

ఆనాడు పుత్రగణపతి తోకపట్టి గిరగిరా తిప్పి విసిరితే పడ్డ పాటుకు వజ్రదంతుడి ఒళ్ళునొప్పులింకా తీరనేలేదు. ధవళ, భర్తకు పరిచర్యలు చేస్తున్నది. వచ్చిన నారదుణ్ణి చూసి, మళ్ళీ ఏం గొడవ తెచ్చిపెడతాడో అని అనుకుంటూనే లోనికి వెళ్ళింది.

నారదుడు మూషికాసురుడితో, "నిన్ను ఘోరంగా పరాభవించిన గణపతి విఘ్నేశ్వ రుడిగా వర్థిల్లుతున్నాడు, మరి..." అంటూ ఆగాడు.



పరాభవాగ్ని రగిలి, వజ్రదంతుడు, "ఇప్పుడేం చెయ్యమంటావు, నారదా?" అని బిక్క మొహం పెట్టాడు.

నారదుడు, "వరాల దేవుడు బ్రహ్మ ఉండనే ఉన్నాడు గదా! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి! ప్రతీకారం సాధించు. గణపతి విఘ్నేశ్వరనామం ధరించాడు, గజముఖుడు! గుర్తుంచుకో!" అని చెప్పి చల్లగా వెళ్ళాడు.

మహాశ్వేత అనే నామాంతరం గల ధవళ ఎంత చెప్పినా వినకుండా, వజ్రదంతుడు, "మహాశ్వేతా! నీ పసుపుకుంకాల పుణ్యమా అని నాకెలాగూ చావు భయం లేదు గద! ప్రతీకారం చేసి మనశ్శాంతిని పొందనివ్వు!" అని చెప్పి ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను ప్రసన్నం చేసుకున్నాడు.

"ఏం కావాలి ఇంకా?" అని బ్రహ్మ అడిగాడు.

"విఘ్నానికి రూపం కల్పించి, నా ఆజ్ఞను వర్తిగా చెయ్యి!" అని మూషికాసురుడు కోరాడు.

బ్రహ్మ విఘ్నాన్ని ఆవాహన చేసి వజ్రదంతుడి ముందుంచాడు. అతడికేమీ కనిపించ లేదు. బ్రహ్మ అతనికి సూక్ష్మదర్శన దృష్టి ఇచ్చాడు. విఘ్నం మామూలు కంటికి కనిపించని కారునల్లని సూక్ష్మక్రిమి రూపంలో అతడికి కనిపించింది.

మూషికాసురుడు ఆశ్చర్యంతో, "ఇదేమిటి! ఈ నలుసును ఏం చేసుకోను?" అన్నాడు.

బ్రహ్మ నవ్వి, "విఘ్నం పెనుభూతం లాగ ఉంటుందనుకున్నావు కాని, విఘ్నబీజం కంటికి కనిపించని సూక్ష్మాణువు. సూక్ష్మ క్రిమివల్ల భయంకర వ్యాధి వ్యాపించినట్లే, అనర్థదాయకమైన విఘ్న కారణం ఎంత చిన్నదైనా, ఎంతటి భీషణాకృతినైనా ధరించి సర్వనాశనం చేయగలదు! కామరూపి, ఏ రూపాన్నైనా ధరించి, అనర్థాలు కలిగించటమే దాని పని. ఏం చేసుకుంటావో చేసుకో!" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

మూషికాసురుడు విఘ్నంతో, "నువ్వు వెంటనే మహాగజాసుర రూపంతో వెళ్ళి విఘ్నేశ్వరుణ్ణి నాశనం చెయ్యి!" అని ఆజ్ఞాపించాడు.

విఘ్నంఏనుగుశరీరమూ, ఏనుగుకాళ్ళూ, భయంకరమైన చిన్న తలా, పెద్ద కోరలూ, నిప్పుల్లాంటి కళ్ళూ గల గజాసుర రూపం పొంది, మహాపర్వతం లాగ కత్తి ఝుళిపిస్తూ ఆకాశానికి ఎగిసి ఎగురుతూ వెళ్ళాడు.

కైలాసంలోవిఘ్నేశ్వరుడు అల్లారుముద్దుగా పెరిగి, తలిదండ్రుల అనుమతితో తాను పుట్టిన



విశ్వకర్మ నిర్మించిన భవనానికి బయలుదేరాడు. ఎదురుగా వస్తూ మన్మథుడు రూపంతో కని పించాడు. విఘ్నేశ్వరుడు ఆశ్చర్యంగా, "కని పించనివాడివి కనిపించావు, ఏమిటి విశేషం? నా మీద నీ విలువిద్య చూపకు సుమీ! అర్భ కుణ్ణి," అన్నాడు.

మన్మథుడు వినయంగా తలవంచి, "గజేంద్రా! నీవు నా బాణాలకు అతీతుడివి. నాకు కనిపించాలని ఉంటే కనిపించే వరం శివుడు ఇచ్చినదే గదా. దగ్గిర పోలికలున్న దగ్గిరవాళ్ళం గనుక కనిపించాను. అంతే! నీవు ఎద్దునెక్కిన శివుడి కొడుకువైతే, నేను గ్రద్ద నెక్కిన విష్ణువు కుమారుణ్ణి. నన్ను శివుడు దహించి బ్రతికించాడు. నిన్ను ఖండించి బతి కించాడు.నా వాహనం చిలుక, నీ వాహనం ఎలుక. మనస్సును చలింపజేసే పూలమ్ములు నా ఆయుధాలైతే, మనో నిగ్రహాన్ని ఇచ్చే పాశాంకుశాలు నీ ఆయుధాలు. మరి నీకు తమ్ముడు కుమారస్వామి పుట్టాలి గదా? పార్వతీపరమేశ్వరుల పరస్పర అనురాగ తేజస్సే కుమారస్వామిగా అవతరించాలి! తారకాసుర నిర్మూలన జరగాలి. అందుకే గదా నన్ను దేవతలు బూడిద కూడా చేయిం చింది. కైలాసం చేరబోతున్నాను, అనుజ్ఞ ఇవ్వు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "మన్మథా! అందుకే నేనూ కైలాసం దిగి వెళ్తున్నదీను. నీ పని నిర్వి ఘ్నంగా నెరవేర్చు, జయప్రదమవుతుంది!" అన్నాడు.

మన్మథుడు అదృశ్యుడై ఆ క్షణమే పార్వతీ శివులున్న అద్భుతమైన కైలాస మంటపాన్ని చేరుకున్నాడు.

విఘ్నేశ్వరుడు భవనాన్ని చేరుకుని, సింహద్వారానికి చేరువగా చంద్రశిలా వేదికపై సుఖంగా కూర్చుని పరిసర ప్రకృతిని ఆనందంగా చూస్తున్నాడు. మెరుగుపెట్టిన వెండి హిమగిరి శిఖరాలు సంధ్యకాంతుల్ని తళతళ ప్రతిఫలిస్తున్నాయి. హిమానీ జల పాతాలు మంద్రగంభీరంగా సరిగములు వినిపిస్తున్నాయి. అలాంటి ప్రశాంత సమయంలో, "విఘ్నేశ్వరుడనేవాడు ఎక్కడ?" అనే భీకర గర్జన దిక్కులుమారుమోగుతూవినిపించింది.

మహాగజాసురరూపం ధరించిన విఘ్నం, విఘ్నేశ్వరుడి ఎదురుగా వాలింది. భూమి కంపించింది. గజాసురుడు, "నేను మహా గజాసురుణ్ణి.నువ్వుగజముఖుడివైతే,నేను గజకాయుణ్ణి! నిన్ను హతమార్చ వచ్చాను!" అంటూ రంకె వేశాడు.

విఘ్నేశ్వరుడు చెవిటివాడిలాగ అమాయకంగా చూస్తూ, "అబ్బీ, ముక్కలు నరుక్కొని చెరుకుగడ తినాలనుంది. గొడ్డలి కాస్త పదును పెట్టి ఇస్తివా నీకు కుడుములు పెడతాను," అని అంటూ పరశువును వాటంగా విసిరాడు. గజాసురుడి కాళ్ళు తెగి పర్వతంలా కూలాడు. విఘ్నేశ్వరుడు ఎక్కి తాండవం చేస్తూ మర్దిస్తూంటే, "మహాప్రభో! నేను విఘ్నాన్ని! బ్రహ్మ ఇచ్చిన వరం మేరకు మహాగజాసుర రూపంలో వచ్చాను. శాస్తి అయింది!" అని విఘ్నం భీకరంగా అరిచింది.

విఘ్నేశ్వరుడు, "నేను విఘ్న వినాశకుణ్ణి! అదీగాక నువ్వు ఇప్పుడు మాయదారి గజాసురుడివి. నిన్ను తుత్తునియలు చేయక తప్పదు. నీ తునకలు నన్ను, నిన్ను ఏమర్చిన వాళ్ళను మాత్రమే పట్టి పీడిస్తాయి. నువ్వు కాళీయ నాగుడవై కాళింది మడుగున దాగి ఉండు. బాలకృష్ణుడు నిన్ను మర్దిస్తాడు. అతని పాదాలు నీ తలలమీద పడి నీ పాప పరిహారం అవుతుంది; జాతి సర్పాల పడగలపై విష్ణు పాదముద్రలు అది మొదలు అలంకారంగా శోభిస్తాయి!" అని చెప్పి, పరశువును పట్టి విఘ్నాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. ఆ రేణువులు అంతటా వ్యాపించి అదృశ్యమయ్యాయి. విఘ్నం అణురూపంతో మిగిలింది. దేవతలు విఘ్నేశ్వరుడిపై పూలజల్లు కురిపించారు.





# ఊగే పడకకుర్చీ

ఒకానొక గ్రామంలో వీరప్ప అనే మంచి నేర్పరి అయిన వడ్రంగి వుండేవాడు. అతడు బాగా వయసులో వుండగా, దేశంలో అనేక ప్రాంతాలు తిరిగి వడ్రంగంలోని మెళుకువులన్నీ క్షుణ్ణంగా నేర్చుకుని తన స్వగ్రామం చేరాడు. వీరప్పకు వడ్రంగంలో ఉన్న చాకచక్యాన్ని గురించి, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో చాలా గొప్పగా చెప్పుకునేవారు.

ఇలా ఉండగా–వీరప్పకు ఒక ఆలోచన వచ్చింది. అదేమంటే, ఇంతవరకూ ఏ వడ్రంగీ తయారుచేయని వింతకుర్చీ నొకదాన్ని చేయాలని. ఆ కుర్చీలో పడుకున్న వాడుగానీ లేక కూర్చున్నవాడుగానీ కావాలనుకుంటే అన్నివైపులకూ తిరుగుతూ సేదదీరేలా ఊగ గలగడం.

వీరప్ప ఎంతో శ్రమపడి నెల రోజుల్లో, తాను చేయాలనుకున్న ఊగే పడకకుర్చీని తయారు చేశాడు. తర్వాత, ఒక వారం రోజుల పాటు దాన్ని స్వయంగా వాడిచూసి తృప్తి పడి, ఆ కుర్చీని దాపులనున్న గ్రామంలోని జమీందారుకు చూపిస్తే, చాలా వెల రావచ్చని భావించాడు.

ఒకనాటి ఉదయం వీరప్ప కుర్చీని సొంత ఒంటెద్దుబండీలో వేసుకుని, జమీం దారుగారి దివాణానికి బయలుదేరాడు. కొంతసేపటికి మిట్టమధ్యాహ్నమయింది. వీరప్ప దారి పక్కన ఉన్న ఒక పెద్ద మర్రిచెట్టు నీడలో బండిని ఆపి, వెంట తెచ్చుకున్న రొట్టెలు తిని, గుర్రానికి మేత వేసి చెట్టు నీడలో కొంతసేపు విశ్రాంతి తీసుకుని తిరిగి ప్రయాణం అవబోతూండగా, దాపులనున్న మామిడి తోపులోంచి అందమైన ఒక గుర్రపు బగ్గీ వచ్చింది.

ఆ బగ్గీ వెనగ్గా ఏదో మాట్లాడుకుంటూ ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వాళ్ళల్లో ఒకరు ఆరడుగులు మించిన ఎత్తూ, కోరమీసాలూ, చేతిలో బంగారపు పొన్ను ఉన్న నగిషీలు చెక్కిన కర్రతో మహారీవిగా ఉన్నాడు. రెండవ

గుడిసేవ మురళీధర్



అతను కాస్త విలువైన దుస్తులు ధరించి, పొడవాటి వ్యక్తికి కాస్త ఎడంగా తల వంచుకుని నడుస్తున్నాడు.

పొడవాటి వ్యక్తి తన గుర్రపు బగ్గీకేసి వెళ్ళబోతూ, వీరప్ప బండీలో వున్న ఊగే కుర్చీ కేసి చూసి ఆగి, వీరప్పను, "బండీలో వున్నది ఏదో వింత కుర్చీలాగున్నదే, అవునా?" అని అడిగాడు.

"అవును, బాబూ! అది ఊగే పడక కుర్చీ," అని చెప్పి వీరప్ప దాని ప్రత్యేకతలు వర్ణించి, తాను దానిని తయారుచేయడానికి రాత్రీ పగలూ ఎంత శ్రమ పడిందీ వివరించి, "దీన్ని జమీందారుగారికి అమ్మాలనుకుంటున్నాను. కనీసం ఐదు వేలు ధర పలుకుతుంది," అన్నాడు.

"జమీందారుగారు ఐదు వేలు ఇవ్వనంటే ఏమిచేస్తావు?" అని అడిగాడు పొడవాటివ్యక్తి నవ్వుతూ.

"నాలుగు వేలు ఇమ్మంటాను," అన్నాడు వీరప్ప.

"జమీందారు ఆ మొత్తం ఇవ్వనంటే?" అన్నాడు పొడవాటి వ్యక్తి.

"మూడు వేలివ్వమంటాను," అన్నాడు వీరప్ప.

"ఆ మొత్తం ఇవ్వనంటే?" అంటూ పొడవాటి వ్యక్తి పెద్దగా నవ్వాడు.

వీరప్పకు ఆ నవ్వులో ఏదో ప్రత్యేకత కనిపించింది. ఒకేసారి ఇద్దరు ముగ్గురు వ్యక్తులు ఏదోవింత చూసి నవ్వినట్టు తోచింది. వీరప్ప ఎంతో వినయంగా, "అయ్యా, వేయి మాటలెందుకు? జమీందారుగారు, ఆ కుర్చీకి కనీసం రెండు వేలన్నా ఇవ్వనంటే తిరిగి ఇంటికి తెచ్చుకుని, విశ్రాంతి కావాలనుకున్నప్పుడల్లా నేనే పడుకుని ఉయ్యాల ఊగుతుంటాను," అన్నాడు.

ఈసారి పొడవాటి వ్యక్తితోపాటు రెండవ అతనూ నవ్వాడు.

తర్వాత వాళ్ళిద్దరూ గుర్రపు బగ్గీ ఎక్కి వెళ్ళిపోయారు.

ఆ సాయంకాలపు చల్లనివేళలో వీరప్ప జమీందారుగారి దివాణం చేరాడు. కోట ద్వారం దగ్గిరున్న కాపలావాళ్ళు అతణ్ణేమీ ప్రశ్నించకుండా లోపలికి వెళ్ళనిచ్చారు. ఆ సమయంలో జమీందారు, దివానుతోనూ, మరి ఇద్దరు ఉద్యోగులతోనూ ఏదో మాట్లాడుతున్నాడు. జమీందారు చమ్కీ పనితనంతో వున్న అందమైన తలపాగా, పట్టుదుస్తులూ

ధరించి వున్నాడు.

జమీందారును చూడగానే వీరప్పకు కాస్త బెరుకు కలిగింది. ఆయన రమ్మని ఆదేశించకుండా, తనకు తానుగా ఆయన ముందుకు వెళ్ళడం ఆయనకు కోపకారణం అవుతుందేమో అనుకున్నాడు.

ఐతే, జమీందారు వీరప్ప పరిస్థితి గ్రహించినవాడిలా చిన్నగా నవ్వి, రమ్మన్నట్టు చేయి ఊపాడు. దానితో ధైర్యం కూడగట్టుకున్న వీరప్ప, కుర్చీతో ఆయన దగ్గరకు వెళ్ళి, దానిని పక్కన బెట్టి, చేతులెత్తి నమస్కారం చేశాడు. తను తయారుచేసిన ఊగే పడక కుర్చీ గురించి చెప్పాడు.

అంతా శ్రద్ధగా విన్న జమీందారు, "నా జమీ గ్రామంలో నీ అంతటి గొప్ప వడ్రంగి వున్నాడని తెలియడం చాలా ఆనందం కలిగిస్తున్నది. నువ్వు ఈ ఊగే పడక కుర్చీని తయారు చేసేందుకు ఎంతో శ్రమపడి వుంటావు. సరే, దాన్ని ఎంతకమ్మదలిచావు?" అని ప్రశ్నించాడు చిన్నగా నవ్వుతూ.

"ఐదు వేలు," అన్నాడు వీరప్ప చేతులు జోడిస్తూ.

ఆ తర్వాత సంభాషణ అంతా దారిలోని మర్రిచెట్టు కింద ఆ మధ్యాహ్నం జరిగినట్టే జరిగింది.

చివరకు వీరప్ప, ఈ జమీందారు పరమ పిసినారి అనుకుంటూ, "అయ్యా, కనీసం రెండు వేలన్నా తమరు దయచేయించకపోతే, కుర్చీ తీసుకుని వచ్చినదారినే పోతాను," అన్నాడు వినయంగా.

ఆ మాటలకు జమీందారు నవ్వాడు. ఆ నవ్వు అచ్చు తను మర్రిచెట్టుకింద విన్నదే అని గుర్తించినవీరప్ప వణికిపోతూ, "అయ్యా, తమరు జమీందారని తెలియక, ఆ మర్రిచెట్టు కింద తమకు దణ్ణం కూడా పెట్టలేదు. క్షమించండి. ఈ ఊగే కుర్చీ తమకు బహుమానంగా ఇచ్చు కుంటున్నాను," అన్నాడు వంగి దణ్ణం పెడుతూ.

ఈసారి జమీందారుతోపాటు, ఆయన పక్కనవున్నవాళ్ళు కూడా నవ్వారు. జమీందారు, దివానుకు చెప్పి, వీరప్పకు పది వేలు ఇప్పించాడు.

వీరప్ప మహా ఆనందంగా తన గ్రామానికి తిరుగుప్రయాణమయ్యాడు.





# లక్ష వరహాల రాయి

మాధవుడనే ఇరవై ఐదేళ్ళ పేదవాడు పొలాల్లో రోజంతా కష్టపడి పనిచేసినా, చాలీచాలని తిండితో అవస్థపడుతూ, తనకంటే వున్న వారందర్నీ చూసి ఉక్రోషపడేవాడు.

ఒక రోజున వాడికి చెరువుగట్టున ఒక సన్యాసి ఎదురై, "ఎందుకు నాయనా విచారంగా వున్నావు?" అని పలకరించాడు.

మాధవుడాయనకు తన మనసులోని బాధను చెప్పుకుని, "నాకు జీవితంలో కష్టానికి తగ్గ ఫలం అనుభవించాలని వుంది," అన్నాడు.

"ప్రపంచంలో అందరూ ఎవరి కష్టానికి తగ్గఫలం వారు అనుభవిస్తున్నారు. ఆ విషయంలో నీకిక విచారమెందుకు?" అన్నాడు సన్యాసి.

"స్వామీ, క్షమించాలి. తమరి అభిప్రాయంపొరపాటు. భగవంతుడు అందరి కృషికీ ఒకేరకం ఫలితాన్నివ్వడం లేదు," అన్నాడు మాధవుడు.

అందుకు సన్యాసి ఒక క్షణం ఆగి, "ఆ విషయం నాకు తెలియదు, నాయనా! ఋజువులేమైనా వుంటే చెప్పు, వింటాను," అన్నాడు.

"ఈ ఊళ్ళో గర్గుడనే మహాపండితుడు ఉన్నాడు. ఆయన అతి సామాన్యమైన జీవితం గడుపుతున్నాడు. గర్గుడి శిష్యుడు భార్గవుడనే ఆయన రాజు కొలువులో స్థానం సంపాయించి వైభంతో వెలిగిపోతున్నాడు," అన్నాడు మాధవుడు.

"గర్గుడు, రాజు కొలువుకు వెళ్ళడానికి కృషిచేశాడా?" అని ప్రశ్నించాడు మాధవుడు.

"లేదు, స్వామీ! ఆయనకీ ఊరు విడిచి వెళ్ళడం ఇష్టంలేదు," అన్నాడు మాధవుడు.

"చూశావా మరి, ఎవరి కృషికి తగ్గ ఫలితం వాళ్ళు అనుభవిస్తున్నారు," అన్నాడు సన్యాసి.

మాధవుడు కొద్దిసేపు తలాడించి, "స్వామీ! ఈ ప్రపంచంలో నాబోటివారికి జరిగిపోతున్న అన్యాయం తమకు పట్టినట్లు లేదు. ఒకే

జొన్నలగడ్డ రామలక్ష్మి

తరహా కృషి చేసినప్పకీ కొందరిని అదృష్టం వరిస్తున్నది. కొందరు దురదృష్టవంతులవు తున్నారు. అదృష్టవంతులు తమ భాగ్యాన్ని దురదృష్టవంతులకు పంచిపెట్టాలనుకోవ డంలేదు," అన్నాడు.

ఆ జవాబు విన్న సన్యాసి, మాధవుడి మీద జాలిపడి, తన జోలె లోంచి ఒక రాయిని తీసి అతడికిచ్చి, "ఇది అపురూపమైన వజ్రం! దీనివిలువ లక్ష వరహాలుంటుంది. దీన్నిసొమ్ము చేసుకుని సుఖంగా జీవించు," అన్నాడు.

మాధవుడా రాయిని తీసుకుని, సన్యాసి కాళ్ళకు దణ్ణంపెట్టి వెళ్ళిపోయాడు.

ఒక సంవత్సరం గడిచాక సన్యాసి, మాధ వుణ్ణి చూడబోయాడు. అప్పటికి మాధవుడి పరిస్థితి పూర్తిగా మారిపోయింది. సొంత ఇల్లు, అందమైన ఇల్లాలు, ఇంట్లో పనివాళ్ళు, ప్రతిరోజు ఇంట్లో విందులు, విలాసాలు-వినోదాలు!

అయితేమాధవుడు, సన్యాసిని చూడగానే, ఏమాత్రం గొప్పలకు పోక, వంగి ఆయన పాదాలకు నమస్కరించి, "ఈరోజిలా వున్నానంటే అంతా తమ దయ!" అన్నాడు.

"నీ సంగతి సరే! అనుకోకుండా నీకు అదృష్టం కలిసివచ్చింది కదా! నీ అదృష్టాన్ని నువ్వుఎంతమందితో పంచుకున్నావో తెలుసు కోవాలని వుంది. నీ దగ్గర పనిచేస్తున్న వారికెవ రికైనా నువ్వు ఇల్లుకానీ, పొలంకానీ కొని పెట్టావా?" అని అడిగాడు సన్యాసి.

మాధవుడు తెల్లబోయి, "మీరు లక్ష వర హాలరాయిని నాకు కదా ఇచ్చారు. జీవితంలో సుఖాలకు మొహం వాచి వున్నాను. అందు కని నా అదృష్టాన్ని అనుభవిస్తూ సుఖపడు తున్నాను. ఇతరుల గురించి నేనెందుకు ఆలోచించాలి, స్వామీ?" అన్నాడు.

"నువ్వు స్వార్థపరుడివి. నీకేమీలేనప్పుడు, అందరూ నీ గురించి ఆలోచించాలనుకుం



టావు. నీకన్నీవుంటే, నువ్వు మాత్రం మరెవరి గురించీ ఆలోచించవు. ఈ క్షణం నుంచే నీ వైభవమంతా నశించిపోగలదు,'' అన్నాడు సన్యాసి.

''వద్దు, స్వామీ అంతమాటనకండి! ఈ వైభవం లేకుండా నేను జీవించలేను. ఇది నిల బెట్టుకునేందుకు, మీరేం చెయ్యమన్నా చేస్తాను,'' అన్నాడు మాధవుడు దీనంగా.

సన్యాసి కాదన్నట్టు తల వూపాడు. అంతే! ఆ మరుక్షణం ఒక నగల వ్యాపారి అక్కడికి వచ్చి, ''మాధవా! నీవు వజ్రమంటూ ఇచ్చింది రాయి నకిలీ వజ్రం. దాని విలువ ఒక్క వరహా కూడా చెయ్యదు. నీ రాయిని తిరిగి ఇస్తున్నాను. నా లక్ష వరహాలూ నాకు తిరిగివ్వు!'' అన్నాడు మాధవుడితో.

చూస్తూండగానే మాధవుడి ఆస్తి అంతా పోయింది. అతడు ఏకాకిగా మిగిలిపోయి దుఃఖిస్తూంటే, సన్యాసి అతణ్ణి ఓదార్చుతూ, ''నాయనా! అదృష్టం కలిసివస్తే, నువ్వేం చేస్తావో తెలిసేలా చేశాను. ఈ జరిగినదంతా, భ్రమ! కేవలం భ్రమ! విచారించకు. చేతనైనంతలో బతుకుతెరువుకు ఏదో ఒక పని చేస్తూ, నిజాయితీగా జీవించు. ఉన్నదానితో తృప్తిపడడం అలవరుచుకో,'' అన్నాడు.

''స్వామీ! నాకిప్పుడు బుద్ధివచ్చింది. నాకు ఆ లక్ష వరహాల రాయినివ్వండి. వాస్తవ జీవితంలో దానిని వివేకంతో ఉపయోగించుకుంటాను,'' అన్నాడు మాధవుడు చేతులు జోడించి.

సన్యాసి మందహాసం చేసి, ''నీకింకా అర్థంకాలేదా? నా దగ్గరున్న రాయికి విలువ కల్పిస్తే లక్ష వరహాలు చేస్తుంది. లేకుంటే వరహాకూడా చెయ్యదు. ఆ చెరువుగట్టు మీద నువ్వు మొదటిసారిగా తటస్థపడినప్పుడు, అక్కడా ఇక్కడా వ్యవసాయప్పనులు చేస్తూండే వాడివి గదా! నీలో ఓర్పూ, పట్టుదలా వుంటే-చుట్టుపక్కల చేసేనాధుడు లేక బంజరుగా పడివున్న సారవంతమైన భూముల్లో ఏదో కొంత భూమిని సంపాయించలేకపోవు. మట్టిని నమ్మి శ్రమించేవాడి కారణంగానే ధాన్యరాసులు పండుతున్నవి. మట్టి నిజం; నీవనుకునే వైభవం కల!'' అంటూ మాధవుణ్ణి దీవించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.




ఇదొక చందమామ కానుక!
15
అజేయుడు గరుడుడు!
చిత్రాలు: పాణి
హఠాత్తుగా కనిపించకుండాపోయిన చంద్రపురి రాజు ఆచూకీ తెలుసుకోవడానికి సేనాధిపతి నరేంద్రదేవుడు, భూతవైద్యుడి సలహాప్రకారం కొండ గుహాలయంలో ఉన్న తాంత్రికవేత్త నాగబంధును కలుసుకోవడానికి వెళ్ళాడు. తంత్రవేత్త అతన్ని తన పక్కనే కూర్చుని పూజాతతంగాన్ని పరికించమని ఆదేశించాడు.


అక్కడ జరుగుతూన్న క్రతువులను చూస్తూంటేనరేంద్రదేవుడిమనసు ఏదో అతీత శక్తికి వశమైపోతున్నట్టు అనిపించింది.


తాంత్రికుడి మంత్రోచ్చారణతో పూజా కార్యక్రమాలు ఆరంభమయ్యాయి.
రాజర్షి నాగబంధు మహరాజ్‌కీ జై!
కీ జై!
రాజర్షికీ జై!
మహారాజ్‌కీ జై!


జై!
నాగబంధు మహరాజ్! జై! జై!
జై! జై!
ఉన్నట్టుండి భక్తులందరూ పూనకం వచ్చిన వాళ్ళలా నాట్యం చేయసాగారు. డేగలా వేషం ధరించిన ఒక యువకుడి చుట్టూ గంతులు వేయసాగారు.


ఆ తరవాత భక్తులు ఏంచేయనున్నారో అని యువకుడు ఆతృతతో ఎదురుచూడ సాగాడు. హఠాత్తుగా....
...వాళ్ళందరూ ఉన్నట్టుండి బాధతో బిగ్గరగా రోదిస్తూ ఒక్కొక్కరుగా కిందపడి విలవిలలాడసాగారు. వాళ్ళ చేతుల్లోని పాములు తప్పించుకోసాగాయి.
అయ్యో! అయ్యో!
హా! అయ్యయ్యో!
ఏమిటిది! అమ్మా! బాబో!
అయ్యో! అయ్యో!



కొందరు కొండజాతి నాయకులు వచ్చారు.
పాములు నామీదికీ ఉరుకుతాయా?
ఏం జరిగింది? లేవండి! లేవండి!
తాంత్రికుడు పిచ్చి ఆవేశంతో పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ఆలయం లోపలికి వెళ్ళిపోయాడు. అతని వెంట కొందరు శిష్యులు వెళ్ళారు.
ఇదొక దుశ్శకునం! క్రతువు కొనసాగడానికి వీల్లేదు!
ఏదో తప్పు జరిగిపోయింది!
గరుడ వేషధారికి ఎలాంటి అపాయమూ వాటిల్లలేదు. గమనించావుకదా!....
నరేంద్రదేవుడు మాట ముగించక ముందే, ఒక శిష్యుడు దేవాలయం నుంచి వెలుపలికి వచ్చాడు.
క్రతువులన్నిటినీ ఆపివేస్తున్నాం. భక్తులందరూ తమ కానుకలను యజ్ఞకుండంలో వేయమని గురుదేవులు ఆజ్ఞాపించారు!


భక్తులను కాటువేస్తున్న పాములను చూసి కొండజాతి నాయకులు భయభ్రాంతులయ్యారు.
రండి వెళ్ళిపోదాం ఈ భయంకర ప్రదేశంనుంచి!
ఏమిటీ భయానక దృశ్యం!
పరిగెత్తిపోవద్దు! కొంచెం నిదానించు! డేగపిల్లల్ని యజ్ఞకుండంలో వదిలిపెట్టు!
తమచేతుల్లో ఉన్న డేగపిల్లల్ని యజ్ఞకుండంలో పడవేయడానికి కొండజాతివాళ్ళు ముందుకు నడిచారు...
దేవాలయం నుంచి తాంత్రికవేత్త ఆగ్రహావేశాలతో వెలుపలికి వచ్చాడు.
ఏమిటిది? భూమి కంపిస్తోంది!
భూమి కంపించడం గ్రహించి భక్తులు చెల్లాచెదురుగా పారిపోసాగారు. డేగపిల్లలు ఎగిరిపోయాయి.
నా శత్రువు యువకుడి రూపంలో వచ్చాడు. వాడు తనను గరుడుడని చెప్పుకుంటున్నాడు!
యువకుడా! పేరు గరుడుడా?
ఇంకావుంది



# ముసలమ్మ యుక్తి

పూర్వం ఒక గ్రామంలో సీతారామయ్య అనే ఒక పండితుడుండేవాడు. ఆయన ఊరి పిల్లలకు చదువు సంధ్యలు నేర్పి గురుదక్షిణలు పొంది, అయిదు వందల రూపాయలు వెనకవేసుకున్నాడు.

ఇంతలో కాశీలో ఒక విద్వత్సభ జరిగింది. సీతారామయ్యకు కూడా పిలుపు వచ్చింది. తన దగ్గర నిలవ ఉన్న డబ్బు ఎవరిదగ్గర దాచి ఉంచాలా అన్న సమస్య సీతారామయ్యకు ఏర్పడింది. ఇంటి దగ్గరే ఉంచుదామంటే భార్య ససేమిరా వద్దన్నది. "సొమ్ము భయంకరమైనది. దానికి నేను కుక్క కాపలా కాయలేను. ఏ రాత్రివేళో దొంగలు వచ్చిపడి నా ప్రాణాలు తీసేస్తారు," అన్నదావిడ.

ఎక్కడ దాస్తే సొమ్ము భద్రంగా ఉంటుందా అనుకుంటూ సీతారామయ్య కోటయ్య అంగడికి వెళ్ళాడు. తనకు ఏర్పడిన సమస్య గురించి కోటయ్యకు చెప్పి, "నీ సలహా ఏమిటి? ఈ డబ్బు ఎవరిదగ్గర దాచిపెడితే క్షేమమంటావు?" అని అడిగాడు. "బాబూ, డబ్బు దగ్గిర ఆ బ్రహ్మదేవుణ్ణయినా నమ్మవద్దు. అది మహాపాపిష్టిది," అన్నాడు కోటయ్య.

వీరిద్దరూ మాట్లాడుతూండే సమయంలో అంగడి గుమాస్తా ఒక స్త్రీకి నెయ్యి తూచి ఇచ్చి డబ్బు తీసుకుని పంపేశాడు.

కోటయ్య ఈ అమ్మకం వివరాలు కనుక్కుని, " ఓరి పాపిష్టివాడా, ఆ మనిషిదగ్గిర నాలుగు దమ్మిడీలు అధికంగా పుచ్చుకున్నావు. మనకు న్యాయంగా రావలసిన లాభం ఒక్క దమ్మిడీ అయితే, అయిదు దమ్మిడీలు లాభం పట్టావు. నీకెన్నిమార్లు చెప్పినా నీ బుద్ధి మారదు. జ్ఞాపకం ఉంచుకుని ఆ మనిషి ఇంకోసారి బేరానికి వచ్చినప్పుడు ఆ నాలుగు దమ్మిడీలూ తిరిగి ఇచ్చెయ్యి," అని గుమాస్తాను కసిరాడు.

ఈ సంఘటనతో సీతారామయ్యకు కోటయ్య మీద గురి ఏర్పడింది. ఆయన



అంగడిలో తనకు కావలసిన సరుకులు తీసుకుని, ఇంటికి వెళ్ళి తన అయిదు వందల రూపాయలూ మూటగట్టి తెచ్చి, ''ఇదుగో, కోటయ్యా! ఇదే నా డబ్బు. నేను కాశీ నుంచి తిరిగి వచ్చేదాకా దీన్ని దాచి ఉంచే భారం నీదే!'' అన్నాడు.

''అమ్మయ్యో, నేనా డబ్బును తాకనైనా తాకను. కావలిస్తే మీరే మా ఇంట మీ ఇష్టం వచ్చిన చోట గొయ్యితీసి డబ్బు పాతేసి వెళ్ళండి. తిరిగివచ్చినాక తవ్వి తీసుకోవచ్చు,'' అన్నాడు కోటయ్య.

''నిజంగా కోటయ్య ఎంత మంచివాడు!'' అనుకుని సీతారామయ్య తన సొమ్మును ఒక చోట గుర్తుగా పాతిపెట్టి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆయన కాశీకివెళ్ళి, విద్వత్సభలో పాల్గొని, స్వగ్రామానికి తిరిగి వస్తూనే కోటయ్య ఇంటికి వెళ్ళి, ''నా సొమ్ము నేను తీసుకుపోతాను,'' అన్నాడు.

''మహరాజుగా తీసుకు వెళ్ళండి. ఎక్కడ పాతిపెట్టారో గుర్తుంది గదా?'' అన్నాడు కోటయ్య.

కాని సీతారామయ్య తవ్విచూస్తే ఉండ వలిసినచోట డబ్బు లేదు. సొమ్ము కనిపించ లేదని అంటే కోటయ్య, ''దాని సంగతి మీకు తెలియాలిగాని నాకేం తెలుస్తుంది, బాబూ!'' అనేశాడు.

మోసం జరిగిపోయిందని గ్రహించి సీతా రామయ్య కుంగిపోయిన మనస్సుతో ఇంటి దారి పట్టాడు.

దారిలో సీతారామయ్యకు శేషమ్మ అనే ముసలావిడ ఎదురుపడి, ''ఎప్పుడు వచ్చావు, నాయనా? అలా విచారంగా ఉన్నావేం?'' అన్నది.

సీతారామయ్య ముసలమ్మకు జరిగిన దంతా చెప్పాడు. శేషమ్మ కొంచెంసేపు ఆలో చించి, ''నాయనా, నీ సొమ్ము యావత్తూ కోటయ్యచేత కక్కిస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి,'' అంటూ ఒక ఉపాయం చెప్పింది. సీతారామయ్య ఆమె చెప్పినట్టు చెయ్యడానికి సిద్ధపడ్డాడు.

ఇది జరిగిన కొద్దిసేపటికి ముసలమ్మ రెండు వేల రూపాయలు ఖరీదు చేసే నగలు పట్టుకుని కోటయ్య వద్దకు వెళ్ళింది. ఆమె కోటయ్యతో, ''చూడు, నాయనా! నా కొడుకు పదేళ్ళ క్రితం చదువుకోసం కాశికి వెళ్ళాడు. ఇంతవరకు వాడి జాడలేదు. నేనా పెద్దదాన్న యిపోయాను. ఎప్పుడు చస్తానో తెలీదు. అందుచేత కాశికి వెళ్ళిన నా కొడుకు జాడ

తెలుసుకుందామని తీర్మానించుకున్నాను. నేను ఒంటరిదాన్ని. నా దగ్గిర రెండువేలు చేసే నగలున్నాయి. వీటిని నా వెంట తీసుకుపోతే దొంగలు దోచేస్తారు. నువ్వు ధర్మాత్ముడవనీ, మనఊరి సీతారామయ్య కూడా కాశీ వెళ్ళే టప్పుడు తన సొత్తు నీ దగ్గిరే దాచిబెట్టాడనీ, ఇతరుల సొమ్మును నీవు మట్టితో సమంగా చూస్తావనీ అన్నారు. అందుచేత ఈ సొమ్ములు నేను తిరిగి వచ్చేదాకా నీ దగ్గిర దాచి ఉంచు, బాబూ!'' అన్నది.

కోటయ్య తనపంట పండిందనుకున్నాడు. సీతారామయ్య తిరిగి వచ్చిన సంగతి కూడా ముసలమ్మకింకా తెలియలేదనుకున్నాడు. ఆయన ఆవిడతో, ''అమ్మా, మీ నగలు మీ చేత్తోనే మీ ఇష్టం వచ్చిన చోట పాతిపెట్టు కోండి,'' అన్నాడు.

ఇంతలోనే సీతారామయ్య అక్కడికి వచ్చి, ''చూడు, కోటయ్యా! నేను సొమ్ము పాతిపెట్టిన చోటు గురించి పొరబడ్డాను. అసలు చోటు జ్ఞాపకం వచ్చింది. అక్కడ తవ్వుకుంటాను,'' అన్నాడు.

కోటయ్య గుండె గుబుక్కుమన్నది. సీతారామయ్య పాతిపెట్టిన అయిదు వందలూ తాను స్వాహా చేసినట్టు తెలిస్తే ముసలమ్మ తన రెండువేల రూపాయల నగలూ తన ఇంట దాచిపెట్టదు. అందుచేత కోటయ్య, ''మీకు కలిగిన సందేహమే నాకూ కలిగి మరోచోట తవ్వి చూశాను. మీ మూట చెక్కు చెదర కుండా దొరికిపోయింది,'' అంటూ లోపలికి వెళ్ళి సీతారామయ్య మూట తెచ్చి సీతారామయ్య చేతికిచ్చేశాడు.

ఇది జరగగానే ముసలమ్మ సీతారామయ్య కేసి పరకాయించి చూసి, ''ఎవరూ? సీతారామయ్యేనా? కాశీ నుంచి ఎప్పుడొచ్చావు, నాయనా? చూడూ, అక్కడ మా అబ్బాయి గాని కనిపించాడా?'' అని అడిగింది.

సీతారామయ్య ఆమెతో, "ఇంతకుముందే చేరుకున్నాను. కాశీలో మీవాడు కనిపించాడు. నాకు రెండు రోజులు వెనకగా బయలుదేరు తున్నాననీ, మిమ్మల్ని బెంగపడవద్దనీ చెప్పాడు!'' అన్నాడు.

''అమ్మయ్య, బతికించావు! అయితే మరి నేను కాశీ వెళ్ళవలిసిన అవసరం లేదన్నమాటే!'' అంటూ ముసలమ్మ సీతారామయ్యతోసహా బయలుదేరింది. జరిగినది చూసి కోటయ్య నిర్ఘాంతపోయాడు.



Arun ICECREAMS

జీవితంతో ఎనలేని బంధం ...

# FREE !!




## హాయ్ పిల్లల్లారా!

ఏదైనా అరుణ్ డిలైట్ ఐస్‌క్రీమ్ కొనండి, ఈ కూపన్‌ని మీ దగ్గరలోని అరుణ్ పార్లర్‌లో ఇచ్చి తీసుకోండి ఒక ఉచిత జూనో చాకో డాట్స్ ఐస్‌క్రీమ్ బార్.

పేరు: _______________

వయసు: _______________

చిరునామా: _______________

_______________

_______________

ఈ ఆఫర్ అరుణ్ ఐస్‌క్రీమ్ పార్లర్ల వద్ద 30.6.02 వరకు మాత్రమే.



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు జూలై 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

మార్చ్ 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
టి. రాజేశ్వరి
8-1-72/1, 'హనుమ'
పెద వాల్తేర్, విశాఖపట్నం-17.(ఆం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో: కళాత్మక బొమ్మలకొలువు కనులకింపు..
రెండవ ఫోటో: వినోద విజ్ఞానాల మేళవింపు!




Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

